Regd No. N. 45 / M. 3813

౹ ౭క అణా

౧౦౨౮౬౭

★ అబిసీనియాలో బ్రిటిషు సైనికుల రహస్య చర్యలు ★

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

★ హిట్లరు ముసోలినీల సమావేశము ★

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ పుష్య బ॥ ౧౦ (౨౧-౪-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౭౨

# కాసాలాను బ్రిటిషు సేనలాక్రమించుట

## ఇటలీని జర్మనీనుండి విడదీయు యత్నము

### ఇటలీరాజుకు రూజ్వెల్టుగారిసందేశము

**అల్బేనియాలో ఇటలీగ్రీసులయుద్ధము**

అల్బేనియాలో మంచు,వర్షముపడుచుండుట వల్ల నేలపంకిలము గానున్నది. గ్రీకుసేనలు వెనుకాడకముందుకునడచిపోవుచునేయున్నట్లు జనవరి ౧౪ వతేదినుండి ౧౮ వతేదివరకు వచ్చినవార్తల వల్ల తెలిసినది. ఇటాలీయసేనలు వెనుకకుపారిపోయి అక్కడకూడ క్రొత్తరక్షణస్థానములను ఏర్పాటుచేసికొననీకుండ గ్రీకుసేనలు ముందుకు త్రోసికొనిపోవుచున్నవి. జనవరి ౧౪ వతేదిన గ్రీకులు మధ్యరంగములో అస్ట్రావిట్జాపర్వతపంక్తియందుండు స్టోవంశిఖరదుర్గములను పట్టుకొన్నతర్వాత ఇటాలీయసేనలు వారలనుముందుకు రానీయకుండ ఆపినవి. స్కాంబి ప్రాంతమునందు ఇదేరోజు గ్రీసులుముందుకుసాగినతర్వాత ఇటాలీయులఒత్తిడిచే మరలవెనుకకుపోవలసివచ్చెను. ఈరెండుతప్ప తక్కినఅన్నిచోట్లను, రోజులలోను గ్రీకుసేనలుముందుకుపోగలిగి క్రొత్తశత్రురక్షణస్థానములను పట్టుకొనుచునేయుండెను, ౧౫ వతేదిన చాలముఖ్యములైన శత్రుదుర్గస్థానములు గ్రీకుల కువశమయ్యెను, ౧౪ వతేదిన కొన్నిదుర్గస్థానాను పట్టుకొన్నపుడు ౧౦౦౦ మంది ఇటాలీయసైనికులు ఖైదీలుగచిక్కిరి. మందుమున్నగుయుద్ధసామగ్రికూడ చాలగ్రీకులకుచిక్కెను. ఇపుడుఅల్బేనియాలోగ్రీకులు చాలముఖ్యమైన క్రొత్తచర్యను మొదలుపెట్టినారనుచున్నారు.

ఏడ్రియాటికుసముద్రంలో ఇటాలీయసేనలను గొనిపోవుచుండినరెండునౌకలు ముంచబడినట్లును, అప్పుడుఆనేకులు ఇటాలీయసైనికులు ఖైదుచేయబడినట్లును రూఢిపడినది. సార్డినియా అను ఇటాలీయనౌక ఇటాలీయయుద్ధనౌకలరక్షణతో పోవుచుండినను డిసెంబరు ౨౮ వతేదిన "ప్రోటక్" అనుగ్రీకు జలాంతర్గామిచే ముంచబడినట్లు ఇపుడువార్తవచ్చినది.

బ్రిటిషువారుఇటాలీయసేనలు అల్బేనియాలోకి పోవుటకు దిగవలసినరేవుఅయిన వాలోనాపైచేసిన విమానాలదాడులవల్ల ఆరేవు నిరుపయోగమైనదట. యుద్ధసామగ్రిని గ్రీసుకు తెచ్చుచు మధ్యమార్గములో సిసిలీసముద్రమందున జర్మను విమానములదాడికిగురియైన బ్రిటిషునౌకలలో ౭ కటినష్టపడకుండ గ్రీసుకుచేరినవి,

అల్బేనీయుజాతి నాయకులు ఒక్కొక్కరుగా ఇటాలీయపక్షమునువదలి గ్రీకులపక్షమునచేరుచున్నట్లుగూడ వార్తలువచ్చినవి.

గ్రీకులుపట్టుకొన్న ఇటాలీయ సైనిక ఖైదీలను విచారించగా, ఇప్రుడు ఆ సైనికులలో ముసోలినీ ప్రేరితమైన యీయుద్ధమునందు ఆసైనికులకుఎట్టి శ్రద్ధలేకుండుటయేగాక, ఆయుద్ధములో పోరాడి పోరాడి అపజయ మొందుటవల్ల కలిగినశ్రమచే వినుగుకూడ జనించినట్లు తెలిసినది. బ్రిండిసీ మున్నగు ఇటలీరేవులలో సేనలను ఓడలెక్కించుచోట సైనికులు ముసోలినీగారియుద్ధము తమ కిష్టములేనట్లు కేకలువేసిరట. జనవరి ౧౫వతేదిన ఒకగ్రీకుఓడ ౬౦౦మంది ఇటాలీయ సైనిక ఖైదీలతో గ్రీసునందలి ఒకఓడరేవువద్ద దిగినపుడు, ఆ ఖైదీలందరు "ముసోలినీని చావనివ్వండి" అని కేకలువేసిరట.

**ఆఫ్రికాలో ఇటలీ- బ్రిటనుల యుద్ధము**

ఆఫ్రికాలో లిబియాయందు బ్రిటిషుసేనలు టోబ్రకుపట్టణముచుట్టును చేర్చబడుచున్నవి. వాటికికావలసినసామగ్రి తెచ్చుటకు రోడ్లు బాగుచేయబడుచున్నవి. బ్రిటిషువిమానములును, నౌకలును ఆపట్టణముయొక్క దుర్గములపై బాంబులను, ఫిరంగులను అధికముగా ప్రయోగించుచున్నవి. టోబ్రకుపట్టణానికి పశ్చిమమందు ఇటాలీయసేనల సంచలనమే కనిపించుటలేదు.

సూడానురాష్ట్రములో ముఖ్యపట్టణము అగు కాసాలాను మరల బ్రిటిషువారు జనవరి౧౯వతేదిన ఆక్రమించినారు. ఈపట్టణముఇపుడు అబిసీనియా చక్రవర్తియగు హెయిలీసెలాసీగారు దిగియున్న ఖార్టూంకుతూర్పున ౨౫౦మైళ్లదూరంలో ఇటలీవారి ఇరిట్రియాసరిహద్దుకు ౧౫ మైళ్ళ దూరములోనున్నది. తూర్పుగా ఇరిట్రియాలోకి పోవు మార్గము, ఆగ్నేయముగా అబిసీనియాలోని వాయవ్యమూలకుపోవు మార్గము కాసాలానుండియే పోవును ఇటాలీయులు ఈపట్టణమును పోయిన జూలైనెలలో ఆక్రమించియుండిరి. అదిమొదలుకొని బ్రిటిషుపహరాసేనలు, విమానములు అక్కడి ఇటాలీయసేనలను అనేకవిధముల పీడించి నష్టపరచుచుండినవి. ఎంతో దూరమునుండి తమసేనలకుకావలసినసామగ్రిని తెప్పించుకొనుచు. ఈలోపల బ్రిటిషువారిదెబ్బలచే ఆసామగ్రికి కలుగు నష్టములనుభవించుచు, తమసేనను అక్కడఉంచుట లాభకరముగాలేదని ఇటాలీయులుతలచిరికాబోలు మెల్లమెల్లగా సేనలను అక్కడినుండికదలించుటకు క్రిస్మసుపండుగకు ఒకటిరెండురోజులముందు ప్రారంభించిరి. ఇటాలీయసేనల ప్రధానకార్యాలయము (కాసాలాకు ఈశాన్యమునఉండెను) ఖాళీచేయబడెను. వెంటనే బ్రిటిషువారు దానినాక్రమించిరి. జనవరి౧౯వతేది నాటికి కాసాలాపట్టణమంతయు ఖాళీచేయబడినదే. అయినానదే బ్రిటిషుసేనలు ఆ పట్టణము నాక్రమించినవి

ఈపట్టణము ఇటాలీయులచేతులలో నున్నంతకాలము వారలనుపడమటినుండి ఎదిరించుట కష్టముగానుండెను. మరియు ఇటాలీయులు అక్కడినుండియు సూడానుపై దండయాత్ర చేయుటకు అనుకూలమైయుండెను. ఈరెండు లాభాలు ఇపుడు ఇటాలీయులకు తొలగినట్లయినది. ఇపుడు బ్రిటిషుసేనలు పారిపోవుచున్న ఇటాలీయసేనలనుతరుముకొనుచు ఇరిట్రియాలోకూడ దూరినవి.

జనవరి౧౮వతేదిన బ్రిటిషుసేనలు గట్టిదుర్గములు కట్టబడియున్న సైనిక స్థావరములను కొన్నింటిని సాబరాత్. టెసెనీప్రాంతంలో ఆక్రమించినవి. ఈబ్రిటిషుసేనలు ఇపుడుతూర్పుగా నడచుచు శత్రుసేనలను తరుముకొనిపోవుచున్నవి. కెన్యాలో బ్రిటిషు సేనలు క్రమంగా కాలూనినిలచి శత్రులకు నష్టముకలిగించుచున్నవి. మొయేలులోకూడ బ్రిటిషు పహరాసేనలు మహోద్యమముగానున్నవి

జనవరి ౧౮వతేదిన కెన్యా, అబిసీనియాల మధ్యసరిహద్దువద్ద ఎల్.ఇబో ప్రాంతంలో ఇటాలీయసైనికులను కొందరిని దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వంవారిసేనలు ఖైదీలనుగపట్టుకొన్నవి. ఇదేరోజు ఉదయము ఇటాలీయవిమానాలు ఈచోటిస్థైబాంబులు వేసినవికాని నష్టము కలిగించలేకపోయెను.

బ్రిటిషువిమానాల దాడులు తీవ్రముగా నేఉంటున్నవి. లిబియాలో ఎల్ఆడెంవద్ద బ్రిటిషువారి విమానాల బాంబులదెబ్బలచే పాడైన ౭౪ఇటాలీయవిమానాలు మరిగిపోవుచున్నవి. జనవరి౧౬, ౧౭వతేదులలో టోబ్రకుపై తీవ్రములైన దాడులు జరిగినవి. ఈదాడిలోరెండవరోజు ఒకఇటాలీయ విమానము అడ్డురాగా ఆస్ట్రేలియానుండి వచ్చిన విమానదళమువారు దానిని క్రిందికికూల్చిరి. ౧౬వ వతేదిన డెర్నాలో సైనికులనివేశనములు,రోడ్సులో మార్తిజావద్ద విమానాశ్రయము ఇటాలీయ తూర్పుఆఫ్రికాలో జైమాగా ప్రాంతంలోకే ప్రోనిదర్కా, అస్సాబు బెర్బెరా, జీలాలు, బ్రిటిషువారి విమానాల దాడులకు గురియయ్యెను. ఈదాడులనుండి ఒకబ్రిటిషువిమానము తిరిగిరాలేదు. ౧౭వతేదిన తూర్పుఆఫ్రికాలో అస్సాబులో ఇటాలీయసేనల మోటారుబండ్లు, హర్గీసాలో సైనికులభవనాలు, ఊహాగర్, అస్మారాలలో సైనికప్రదేశాలు బ్రిటిషు దాడులకు గురియయ్యెను. లిబియాలో పహరాతిరుగబోయిన ఒక బ్రిటిషువిమానము తిరిగిరాలేదు. ౧౮వ తేదినను ౧౯వతేదినను తూర్పుఆఫ్రికాలో బెసెసీకి ఆగ్నేయంలో ఇటాలీయుల మోటారుబండ్లు, మరతుపాకులు ఉండుచోట్లు మసావా,అస్సాబు, హర్గీసాలలో ముఖ్యస్థానాలు బ్రిటిషుదాడులకు గురియయ్యెను. లిబియాలో శీతోష్ణస్థితి అననుకూలముగుటవలన ౧౯వతేది బ్రిటిషు విమానాలు దాడి చేయలేదు.

అబిసీనియాలో ఇటాలీయుల పరిపాలనను తొలగించుటకై ఎదురుతిరుగుచున్న జాతీయ నాయకులకు, వారియనుచరులకును బ్రిటిషు సేనలు శిక్షణనొసగుచున్నట్లు ఇపుడు తెలియుచున్నది. ఇందుకై పోయినజూలైనెలలో కొందరు బ్రిటిషు సైనికులను, సైనికాధికారులను అబిసీనియాకు పంపబడిరి. వారు అబిసీనియాసరిహద్దుదాటి,నాలుగైదునందలమైళ్ళు లోపలికిపోయి అక్కడ ఒకచోట రహస్యముగా ఇటాలీయులుఎంతవెదకినను చిక్కకుండచేరి అబిసీనియా జాతివారికి అనుకూల యుద్ధపరికరాలను ప్రయోగించుపద్ధతి నేర్పుచున్నారట. వీరితర్వాత మరికొందరు బ్రిటిషుసైనికులుగూడ అక్కడికి పోయిరట. ఇటాలీయవిమానాలు ఒక్కసారిమాత్రము టానాసరస్సువద్ద ఆబ్రిటిషుసైనికుల శిబిరాలకు సమీపంలో బాంబులువేయగలిగెనట. కాని బ్రిటిషువారికి నష్టముకలుగలేదు. సూడానులోగూడ కొందరు అబిసీనీయులకు (వీరలుఅబిసీనియాలో ఇటాలీయులపరిపాలన పెట్టినతర్వాత సూడానులోకి చేరికొనియుండినవారు) బ్రిటిషుసేనలు శిక్షణనొసగుచు తిరుగుబాటు నేర్పుచున్నవి. ఇపుడు ఈసూడానులో శిక్షణనిప్పించే బ్రిటిషుపార్టీకిని, అబిసీనియాలో శిక్షణనిప్పించే బ్రిటిషుపార్టీకిని రాకపోకలు, ఉత్తరప్రత్యుత్తరములు జరుగుచుండునట్లు ఏర్పాటుచేయబడినది. ఇటీవల అబిసీనియాలోని ఆబ్రిటిషుపార్టీనుండి ఎట్టిలేఖగాని రానందువల్ల ఆపార్టీని ఇటాలీయులు ఖైదుచేసిరని భయపడి సూడానునుండి ఒకబ్రిటిషు మేజరుఅధికారిపోయి అక్కడ ఆపార్టీవారికని ఒక్కగా సాగుచున్నట్లు చూచివచ్చెను. ఈమేజరు అధికారి అక్కడికిపోయినపుడు అబిసీనీయులకు హెయిలీసెలాసీగారి సందేశమును వినిపించెను.

సిసిలీదీవిలోని కాటేనియాపై బ్రిటిషువిమానాలు జనవరి ౧౫ వతేదిరాత్రి బాంబులనువేసినవి. జనవరి ౧౨ వతేదినాటిదాడితోకూడ కలిపి ఇంతవరకు ౩౦-౪౦ జర్మనువిమానాలు బ్రిటిషువారిదాడిచే పాడైనట్లు తెలుపబడుచున్నది. సిసిలీలోనాజీలు ఇప్పుడుచాలాగిరాకీతోతిరుగుచు ఇటాలీయులను తక్కువగాచూచుచున్నట్లు లండనునుండివచ్చినవార్త తెల్పుచున్నది.

సిసిలీనుండి జర్మనువిమానాలు, ఇటాలీయవిమానాలతోడుతో మాల్టాపైకిపోయి బాంబులు వేయుచున్నవి. జనవరి ౧౬ వతేదిన ఆరుసార్లు దాడిజరిగెను, కొందరుజనులఆస్తులు నాశమయ్యెను. ౧౭ వతేదిన మహాతీవ్రమైనదాడిజరిగెను. క్రిందనుండిన బ్రిటిషువారు మొత్తము ౧౦ శత్రువిమానాలను క్రిందికికూల్చిరి. ఈదాడులచేఇండ్లు, చర్చీలునాశమయ్యెను. ఆనేకులుజనులు ఆ కూలినయిండ్లక్రిందబడిరి.౧౮ వతేదిన మొత్తము నాలుగుదాడులుజరిగెను, అన్నిదాడులలోనుకలిసి శత్రువిమానాలు క్రిందకూల్చబడినవి. బ్రిటిషువారివిరెండువిమానాలు క్రిందకూల్చబడెను. శత్రువిమానాలువదలిన బాంబులచేప్రభుత్వమువారిసొత్తుకు కొంతనష్టముకలిగెను.౧౮ వతేదినజర్మనువిమానాలు మాల్టావద్దబ్రిటిషు యుద్ధనౌకల మూలస్థానాలపై బాంబులువేసినవి. ఈరోజు మాల్టాపైకివచ్చిన జర్మనువిమానాలలో ౧౪ క్రిందకూల్చబడినవి. ౧౯ వతేదినమొత్తము అయిదు తీవ్రములైనదాడులుజరిగెను. ఆదెబ్బకు క్రిందజనులసొత్తుఎంతయోనష్టమయ్యెను, ఎట్టిగట్టిభవనములుకూడకూలెను. వాటిక్రిందజనులుఆనేకులుపడి. బ్రిటిషువారివిమానమునొకదానిని శత్రువులు క్రిందకూల్చిరి.

ప్యాలెస్టైనులో ౧౮ వతేదిన వేకువజామున రెండుశత్రువిమానాలు పైనుండివేసినబాంబులుపడెనుగాని నష్టములేదు పోయినసెప్టెంబరు ౨౮ వతేదిన హైఫాపైఇటాలీయ విమానాల దాడులతర్వాత ప్యాలెస్టైనుపై ఇదియేతిరిగి మొదటిదాడి. ౧౭ వతేదిన ప్యాలెస్టైనులో టెల్అవిల్లో బ్రిటిషువిమానాశ్రయమునకు శత్రుదాడిచేనష్టముకలిగినది.

౧౪ వతేదిరాత్రి నూరోయెజుకెనాలు. అలెగ్జాండ్రియాలమీద శత్రువిమానాలదాడులు జరిగెను.

ఇకనౌకాయుద్ధములసంగతిచూతము. బ్రిటిషుజలాంతర్గామియొకటి మోటారుకారులను మోసికొనిపోవుచుండిన నౌకతోకలిసి రెండుఇటాలీయనౌకలను సముద్రంలో ముంచివేసినట్లు జనవరి ౧౭ వతేదినాటివార్తలోనున్నది, గ్రీకులచే ఇటాలీయుల జలాంతర్గామియొకటి సముద్రములోముంచివేయబడినట్లు ౨౦వ తేదినాటివార్త లోనున్నది.

అమెరికాసంయుక్తరాజ్య ప్రభుత్వపక్షమున ఇటాలీయప్రభుత్వమునకు రాయబారియగు విల్లియం ఫిలిప్సుగారుమరల ఇటలీప్రభుత్వరాజధాని నగరమగు రోముకుపోవుచు తనచిరమిత్రులైనఅనేకఇటాలీయులతోసంభాషించినాడట. ఈయనరూజ్వెల్టుగారినుండి ఇటలీరాజుఅగు విక్టరు ఇమాన్యుయల్ గారికొక సందేశమునుగొనిపోవుచున్నాడట. ఈఅంశములనుబట్టి ఒకఅమెరికారాజ్యపత్రిక యొక్క విలేఖరి బహుశారూజ్వెల్టుగారు ఇటలీజర్మనీనుండివేరై బ్రిటనుతోసంధిచేసికొనవిషయంలో ఇటాలీయప్రజాముఖ్యుల అభిప్రాయమెట్లుండునోయని కనుగొనుమని తమ రాయబారికిపెట్టినారని ఊహించినాడు,

హిట్లరుముసోలినీగారలు ౭ వతేది ౨౦వతేదిన ఎక్కడనో (అచోటును అధికారులు తెల్పలేదు) సమావేశమై పరిస్థితులనుగురించి ఆలోచించి ఏకాభిప్రాయమునకు వచ్చినట్లు రేడియోలో ప్రకటించబడినది.

ఇటలీలోకి జర్మనుసేనలు అపరిమితముగా చొచ్చి చేరుచున్నవి.

**బ్రిటనుగ్రీసుల యుద్ధము**

జనవరి ౧౨వ తేదినుండి ౧౫వతేదివరకు బ్రిటనుపై శత్రువిమానాలు మొత్తముమీద ప్రతిరాత్రియూడి చిచ్చుబాంబులను, గ్రేండు బాంబుల నుకూడ ఎక్కువగా వర్షించినవి. కాని పూర్వము వలెగాక ఇప్రుడు బ్రిటిషువారు అ చిచ్చుబాంబులుపడినవెంటనే మంటలను చల్లార్చునుయ్యవస్థచేసియుండుటవల్ల నష్టముతగ్గుచున్నది. దక్షిణఇంగ్లాండులో స్లిమత్ అనుపట్టణముపై జనవరి ౧౦ వతేది, ౧౨వ తేదులలో రాత్రులందు తీవ్రమైన దాడులు జరిగినవి. ౧౦వతేదిన చర్చీలు, బళ్లు,వాణిజ్యశాలలు అనేకములు పాడైనవి. చాలమంది మరణించిరి, అనేకులు గాయపడిరి. ౧౨వతేదికూడ నష్టము జరిగెనుగాని ఇంతకంటె తక్కువ. ౧౦వ తేదిన ఇంకొకవిశేషమేమనగా అమెరికానుండి బ్రిటిషువారికి పంపబడిన విమానంలోనివారు ఒక జర్మనువిమానాన్ని క్రిందికికూల్చిరి. ౧౧వతేదిపగలు తూర్పుకొండలలో కొన్నియిండ్లు పాడగుటయు, కొందరుమరణించుటయు తప్ప పెద్దదాడియేమియు బ్రిటనుపై జరుగలేదు. ఈరోజురాత్రిలండనుపై వేలకొలది చిచ్చుబాంబులు వేయబడినవి. భవనాలనష్టము, కొన్నిచావులు జరిగినవి. భూగర్భంలోనుండే రైలుస్టేషనుకు పోయ్యేత్రోవపై బాంబులుపడి ఆమార్గమంతయు కూలి పాడైపోవుటయేగాక అభూగర్భంలోనివారు చిక్కుపడిరి, అనేకులు మరణించిరి, ౧౭వతేదిపగలు విశేషములులేవు. ౧౮వ తేది రాత్రి, పగలుకూడ విశేషాలులేవు. ౧౯వతేదిపగలు ఆగ్నేయ ఇంగ్లాండులో ఒకగ్రామసరిహద్దుపై బాంబులు వేయబడెను, మిడ్లెండ్సుపైకూడ బాంబులు వేయబడెను. ఈరాత్రిబ్రిటనులో దాదాపు అన్నిప్రాంతాలపైనను జర్మనువిమానాల దాడులు జరిగెను. అయితే మొత్తమునష్టము తక్కువ.

౧౦వతేదిరాత్రి, ౬ ౧౧వతేదిరాత్రి ఒకటి, ౧౭వతేదిరాత్రి రెండుజర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి. జనవరి ౧౧వతేది అర్ధరాత్రితోఅంతమగువారంలో మొత్తము ౭ జర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి. వాటినెదురొన్న బ్రిటిషు విమానాలలో ఒక్కటియేనష్టమైనది.

జనవరి ౧౨వతేదినుండి ౬ రోజులలో ప్రతిరోజుపగలు, రాత్రికూడ బ్రిటిషువిమానములు జర్మనీఆక్రమించిన ఫ్రాన్సు మున్నగుదేశాలమీదికిని జర్మనీమీదికిని, ఇటలీమీదికినిపోయి సేనలపైనను సేనలకవసరమైనవస్తువులను తయారుచేసేస్థానాలపైనను, అట్టివస్తువులుండేస్థానాలపైనను బాంబులవర్షించుచున్నవి. ఈదాడులుఇంతవరకు బ్రిటిషువారుచేసినదాడులకంటె చాలతీవ్రములుగానుంటున్నవి జర్మనీప్రధానగరమగు బెర్లినులోని ఒకపత్రికకూడనిజంగా ఈదాడులవల్ల చాలదెబ్బతగులుచున్నట్లువ్రాసినది. ఈ ఆరురోజులలో పగటిపూటకూడ బ్రిటిషువిమానాలు గుంపులు గుంపులుగాపోవుచున్నవి. రాత్రిపూట బ్రిటనుమీదికిదాడివెడలుటకై జరిగెసన్నాహములను ఏ పగటికాపగలేభగ్నపరచే ఉద్దేశ్యంతో బ్రిటిషు విమానాలు ఈపగటిదాడులను ప్రారంభించినట్లున్నది ఈదాడులనుండి జనవరి ౧౧వతేదిరాత్రి రెండు, ౧౭వతేదిపగలు మూడు, రాత్రిఒకటి, ౧౮వతేదిరాత్రిఒకటి, బ్రిటిషు విమానాలు తిరిగి స్వస్థానాలకుచేరలేదు ౧౧వతేది, ౧౬వతేదిరాత్రులలో విల్హెంషేవన్ అను జర్మనునౌకలమూలస్థానంపైదాడులచే చాలగొప్పనష్టముకలిగెను, నార్వే సముద్రంలో పోవుచుండిన జర్మనునౌకలపై జనవరి ౧౭వతేదిన బ్రిటిషువిమానాలు మంచిదెబ్బలనువేసినవి. బ్రిటిషుదాడులకుగురియైన ఇతరప్రదేశములవివరాలన్నియు తెల్పుటకుఇక్కడ స్థలంచాలదు

---

**నిజాంరాష్ట్రి మేరుసంఘము**

హైదరాబాదు(దక్కన్), జనవరి ౨౨

హైగంఘమహాజనసభ జనవరి౨౬వ తేది సాయంత్రమర గం॥లకు రెడ్డిబోర్డింగుహాలులో శ్రీ వెన్న నరసయ్యగారి అధ్యక్షతన జరుగును. మాడపాటి హనుమంతరావుగారు మున్నగు వారలుపన్యసింతురు.

## జనాభా లెక్కలలో భాషా మత విషయము

### ఆర్యసమాజమువారి దుస్సాహస ప్రబోధము

ప్రజలజీవన ప్రాణ మానరక్షణల కుపయోగ పడవలసియున్న భూమ్యాదాయ నిర్మాణ న్యాయరక్షక ఇత్యాదిశాఖలలో జరుగు ననుకూలములను, శాశ్వతాచరణ కుత్పత్తిగాపెంపబడుశాసనాదికముల యుక్తాయుక్తములను, ప్రజామూక ఎంతఎలుగెత్తి విన్నవించుకొనుచున్నను ప్రభుత్వాధికారులు చెవియొగ్గివినక, తగుసమాధానమీయక తాముగావించెడిదేమో కావించి వేయుచుండునపుడు ఇష్టములేకపోయినను ఆ ప్రతికూలశాసనములకే చేయునదిలేక తలయొగ్గుచుండునట్లు పదిసంవత్సరములకొకతూరి వచ్చిపోవుచు తిరుగి వ దిరుగాడు నీతాత్కాలికజనాభా విపరీతములకుఆదరి పరిగావలయునను మనకోరికలీ చివరకాలమునందు వినువారెవ్వ రుందురని సందేహము.

"గతకాలముమేలువచ్చు కాలముకంటెన్" యను నీతియుక్తిని కాలపంథా యనుసరించుచున్నది. గత జన పరిగణనకాలములలో క్రింద (జిల్లాలలో) సిద్ధము గావింపబడు జనపరిగణన సంబంధముగుయావత్తులెక్క విషయ పత్రములను దేశభాషలలో ముద్రించిన వానిపైన జేయించి యుండినందున వావంత కలవరకారణములుకాక పోయెను, కాని యిప్పుడు ఆరంభమునుండే జనపరిగణనశాఖవారు నూతన పంథాను త్రొక్కి రెవ వంతు కాలమును ఎక్కట్లలో ఈడ్చిపారవేసిన వారైరి. ఇకపరిగణనగడవుకాలము సమీపించుచున్నది. ఈకొస్తాగూడా ఏదోవిధముగా నిస్సంకోచముగా గుంజిపారవేయుట మనముచూడగలము. ప్రజావాంఛను ప్రభుత్వమువారు పాటించకపోయినా ఈజనపరిగణనోద్దేశమిందు ఎంతవరకు సార్థకపడుచున్నదో గమనించకపోవుట నేను పీఠికగాచెప్పినమాటలే పాటియని తెలుసుకొనవదగును. నాపరిచయులలో కొందరు పరిగణకులు, తనక్కీకునిందాలు (పరిశీలకులు) గ్రామోద్యోగులలోను, తదితరులలోను పెక్కులుగలరు, వారికిఉర్దూభాష తెలియదు. అట్టివారు ఉర్దూపరిచితిగల వేరువారికి కొంతధనసత్కారములతో వ్రాయించుకొనుచు బాధలు పడుచున్నారు. మరికొందరువచ్చిరానివారు తామే వెళ్లదీసుకొనుచు ఉర్దూభాషలో అందునవాడొక అక్షర పోలికగానటువంటి ములికీఅచ్చులోనుండి కలముపెట్టితే శిరదిగిపోయితూట్లుపడేకాగితాలపైన అచ్చుపడివచ్చేనమోనాలు తెలియక తికమకలుపడుచు పైబడ్డభారమునేదోవిధముగామోసి తీర్చుకొన తిప్పలుబడుచుండుట నేనుస్వయముగా చూచుచున్నాను. వీరికివిషయగ్రహణ శక్తినిచ్చుటకు వాజరులు (దృష్టిపారంగులు) మొదలగు వారు సామాన్యముగ దేశభాషలనెరుగని ప్రభుత్వోద్యోగులైయున్నారు గనుక ఇకలెక్కలు సరిచేయబడుట యంతెంతే యింసెను, బాధ్యత లేనిసహాయకులు,భాషాపరిచితిలేని వ్రాయసకాండ్రు,అందులో విరివిగాఆకాగితాలైనా సక్లయితేకుండా వ్రాయజాలుటురో చదువరులూహించదగును. తనక్కీసాజాలు (పరిశీలకుల)కుసుంచి ఈ లెక్కలు సరిగావించేవారిక నెవ్వరును లేరు. వారిగ్రహచారమిట్లున్నది. గనుక పరభాషామూలముగసంభవించు నీయపభ్రంశములవల్ల జనపరిగణనశాఖోద్దేశము భ్రష్టమైపోవుచుండుట నిస్సంశయవిషయము వినువారలుగానరాక వెనుకటినుంచిజరుగుచున్న దిప్పుడున్ను జరుగవలెననిలాంఛనగ నిర్ణయము నీ జనపరిగణనయందు జరుగు భ్రమప్రమాదములకు విలేఖరులూహించి చింతించిన వినియోగమిప్పుడేగలదు! నేను గతరెండు జనాభాలలో పనిచేసియున్నాను. ఇప్పుడు గూడా నియమింపబడి పనిజేయుచు నాకుగల యనుభవ విషయములను విన్నవించుచున్నాను. ఇక తదితరవిషయములనుగురించిగూడ యొకించుక విన్నవించెదను.

స్వతంత్రతగోలుపోయి, పరపీడనచే దారిద్ర్యపీడితులై, దాస్యశృంఖలాబద్ధులై నిరవలంబనజీవితముతో గృశీభూతులయ్యియు ధనాశను, అధికారసంపత్తిని, స్వాతంత్ర్యరుచినిజూ పెదమని ఇతరులెంతతమవంక కాహ్వానించుచున్నను పురాతనసాంప్రదాయముల వీడజాలక వేల తరబడి గతమవిశుద్ధమతి జాతీయతను గాపాడుకొనుచు వచ్చుచున్న మనహిందూజాతి నీపరిగణనకాలమునందు హిందువులకు ఆర్యఅని వ్రాయించుకొనుమని హిందూమతాంతశ్శాఖాకన్యమైన ఆర్యసమాజముకోరిక ననుసరించుటకుగూడ హిందువులకు సహింపరాని విషయముగును, ఈవిధమున నీప్రశస్త హిందూమత నామము నంతమొందింపచేసెందుకనను మనస్కరించదు. మరియువేరుగా ఆర్యఅనివ్రాయించుకొని విభేదపడిపోవజూచి హిందూమతవైన్యతను ప్రకటింపజేయు దుస్సాహసమునకు హిందూ మతాంతశ్శాఖలయ్యు హైందవవిశుద్ధత నెంతోయభిమానముగచాటుచుండెడి యార్యసమాజశాఖవారు పూనుకొనకుందురుగాక యానియు ఇక్లే ఆంధ్రమునుభాషించు మనభాషావైశాల్యతను శోషింపజేసెడు అన్యభాషాప్రయోగ ప్రబోధమును విసర్జించెదరనియు ఆంధ్రమహా సభాధ్యక్షులు సూచించినట్లు ఈగొడవలలోపనెక జనపరిగణన శాఖీయులుగూడ ఉన్నదున్నట్లు వ్రాయుచుందురుగాక యని గోరుచున్నాను.

ఇట్లు విన్నవించు

అయితరాజు జీడికంటి రామారావు

---

### సర్. సి. పి. రామస్వామిఅయ్యర్ గారి ఆగమనము.

హైదరాబాదు, ౧౯ జనవరి.

సర్. సి. పి. రామస్వామిఅయ్యర్ (ట్రావెన్‌కూరు మంత్రిగారు) ఈనెలఆఖరులో ఎల్లోరా మరియు అజంతాగుహలను చూచుటకు ఔరంగాబాదుకురాగలరు. వారు హైద్రాబాదులోకూడ ఒకటిరెండుదినములు ప్రభుత్వమువారి అతిథులుగానుందురని తోచుచున్నది.

(ఓరియంటల్ ప్రెస్సు)

---



---

## మాతృభాషాపజిల్, (రిజిష్టరుబడ్డ) నెం. 7

బహుమానములు రు 1,600 మరియు వెస్టెండ్ సెకండస్ రిస్టువాచి

### ముగింపు తేది 5-2-41

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 మా | తృ | 2 భా | ణి | | 3 ఓ | | 4 మా | న | 5 ము |
| 6 ని | | | | స | | | | | |
| 7 క | 8 వృ | లు | | | | 9 | తి | 10 మ | |
| | | | 11 | న | ము | | | | |
| 12 కా | ము | | | ము | | 13 మ | | | |
| | | | 14 కా | | | | | 15 సి | |
| క | | 16 | మ | ము | | | 17 గి | | |
| | 18 | | | | 19 క | | | | 20 |
| 21 | ర | ము | | | | | 22 ము | | ము |
| | తి | | 23 | క్ష | | 24 ప | | | |

ఈపజిలులో పాల్గొను పోటీదారుల యొక్క వరుసనెంబరు లాటరీవేసిఅందులోవచ్చిన నెంబరుయొక్క పోటీదారునకు పైగడియారము బహూకరింపబడును

మొదటిబహుమానము రు 1000
రెండవబహుమానము రు 300
మూడవబహుమానము రు 200
మెరిట్ బహుమానములు రు 100
ప్రవేశరుసుము కూపను1-కి రు 0-4-0
5 కూపనులు పంపువారికి 1 రూపాయిమాత్రమే!

ఈపజిలు తాలూకు సొల్యూషన్ సీలువేసి బెజవాడ ఆంధ్రబ్యాంకులో డిపాజిటు చేయబడియున్నది.

**ఆధారములు (అడ్డము)**

1 మాతృభాషా పజిల్సువారి మాసపత్రిక
3 వసూలుతో నిమిత్తంలేకుండా నిర్ణయించిన ప్రకారము దీనియొక్క మొత్తమును మా పజిల్సులో పొందగలరు.
6 ధ్వని
7 శ్రీరాముని సేన
9 బొమ్మ
11 ఋషులు విశేషకాలము యిందులో గడుపుదురు.
12 మన్మథుడు
13 ఒక నక్షత్రము
15 జుట్టు
16 ఉత్తరములలో సాధారణముగా ముందు దీనినిగురించి వ్రాయుదురు
17 కొండ
19 గ్రంథక
21 సాధారణముగా యిదిచేయనిదేవస్తువుకొనరు
22 అద్దంలోచూచుకొంటే నేగాని కనుపించదు
23 నూరువేలు
24 దంతము

**ఆధారములు (నిలువు)**

1 ధాన్యము కొలుచునది
2 పత్రికలద్వారా తెలుసుకొనబడునవి
3 పాఠశాల
4 హనుమంతుడు
5 నిజమైన దైవభక్తులు కాంక్షించునది
6 గౌరవము
8 పరోపకారమువల్ల లభించునది
10 పిండిని తయారుచేయుయంత్రము
12 స్త్రీలు కళ్ళకుపెట్టుకొనునది
13 పిచ్చివానికి ఇదిస్థిమితముగానుండదు
14 ఇదిలేనివాడు మహాపురుషుడు
15 సంపద
18 భగవంతునకు సమర్పించు కర్పూరజ్యోతి
19 పెండ్లిగాని పడుచు
20 యమలోకాధిపతి
22 ఇది కాలిలోగుచ్చుకుంటే బాధపెట్టును

### మా పజిలు నెం 6. లో బహుమానములు పొందినవారి పేర్లు ది 18-1-41 న వెలువడిన "ఆంధ్రజ్యోతి"లో ప్రకటింపబడినవి.

అచ్చుకూపన్లు వలయువారు మాకు తెలియపరచిన ఉచితముగాపంపెదము. మా అచ్చుకూపన్లమీదనే వ్రాయవలయునని నిబంధనలేదు, తెల్లకాగితములమీద గూపన్లగీసి వ్రాసి ఒక్కొక్కరు ఎన్నికూపన్లనైనా పంపవచ్చును. సిరామాత్రమే ఉపయోగించవలెను. యీ పజిలు తాలూకు సొల్యూషనున్ను బహుమానములు పొందినవారి పేర్లున్నూ, రాబోవు క్రొత్తపజిలు నెం. 8 న్ను, ది 15-2-41 న వెలువడు మా సంపాదకీయము "మాతృవాణి"లోను, "ఆంధ్రజ్యోతి" లోను ప్రకటించబడును. "మాతృవాణి"సంచిక వలయువారు 0-1-6 పోస్టుబిళ్లలుపంపిన ఉచితముగా అందచేయుదుము. మేముయిదివరలో ప్రకటించినప్రకారము మా "మాతృవాణి"సంచికను,కొన్ని కారణములవల్ల, మా పజిలు పోటీదార్లకు అందించలేకపోయినందులకు, క్షమింపప్రార్థన. పజిలు నెం 6 రుసుముతోబాటు అణాబిళ్ళుపంపినవారికి ఫిబ్రవరినెలలో తప్పకపంపెదము.

ఇతరవివరములకు, విడికూపన్లకు, పజిలు నెం 6 బహుమానముల పట్టికలకు,

మాతృభాషాపజిల్సు (రిజిష్టర్డు) బెజవాడ.

---

## సూర్యాపేట

### హత్యచేసినవారెవరు

(స్వ. వి.          ౧౬-౧-౪౧

౧౯౪౧ జనవరి ౪౧ నాడు సూర్యాపేట గ్రామమునకు సమీపమున చింతలచెరువు అను గ్రామంలో కొత్తకుంట పేరుగల చెరువులో ఒక శవముపడియున్నట్లు తెలియగా స్థానిక పోలీసువారుపోయి పంచనామ చేసి, ఆశవము నీళ్ళలోనుండగా, వెలుపలికితీసినతర్వాత వీపుప్రక్కనుండి మరియు ముందుప్రక్కనుండి ఫోటోతీసుకున్నారు.

ఇదివరకు ఆయువకుడెవరు? ఎచ్చటివాడైనది తెలియలేదు.

నిజాంరాష్ట్రపు ప్రతిపోలీసుస్టేషనుకు మరియు సూర్యాపేటకు సమీపమునున్న బ్రిటిషు పోలీసుస్టేషనుకు తెలియజేసి వారి తల్లితండ్రులకు ఈ వార్తందునట్లుచేయగలరని ప్రార్థన.

### ౧౦౦౦ జీవులనొకేసారి హత్యమొనర్చుట

సూర్యాపేటకు తూర్పుదిశ ౨ మైళ్ళదూరమున దురాజిపల్లిఅను గ్రామముగలదు అచ్చట ఒక కొండమీద గొల్లవాండ్లదేవుడు లింగమంతులు పేరిటగలరని వారు ౨ సంవత్సరములకు ఒకసారి ఉత్సవము జరుపుదురు. దానిలో పాల్గొనుటకై హైద్రాబాదునగరమునుండి, తూర్పున బెజవాడ సమీపమునుండి, ఉత్తరమున వరంగల్ ఖమ్మం సమీపమునుండి, దక్షిణమున కృష్ణానదితీరమునుండి గొల్లలు తండోపతండములుగ ఇంటికి ఒక గంప మరియు ఒక మేకనుతీసుకొనివత్తురు గంప మేకను లేని గొల్లవారు ఆయాత్రను చూడగూడదట ౯౦౦౦ గొర్రెల కన్న ఎక్కువబలియిచ్చినమాత్రమునే ఆదేవునికి శాంతికలుగునట! తక్కువకాగూడదట!

౨౪ ఫిబ్రవరి ౧౯౪౧ నాడు ఉదయం ౭ గంటలవరకు కొండంతయు రక్తప్రవాహముచే భీతికలిగించురూపము దాల్చియుండును.

పైవిధముగ మూఢభక్తివలన ఎన్నియో ఘోరకృత్యములను చేసి ధర్మద్రోహులగుచున్నారు. గానయువకులు నడుముకట్టి ప్రపంచకళ్యాణము చేకూర్చు ఈదుష్కార్యముల మాన్పించగలరు.

## పదులాబాదు

### గ్రంథాలయస్థాపనసమావేశము

(ఒ-వి)          ౧౫-౧-౪౧

౧౪-౧-౪౧ మంగళవారము రాత్రి ఎనిమిది గంటలకు ఈగ్రామంనకు వెలుపలనున్న శ్రీ లవంగు లక్ష్మారెడ్డి గారి పొలములో సభసమావేశమాయెను. సభకు దాదాపు అయిదువందల జనులవరకు వచ్చియుండిరి. బోల్లాపల్లినుండి శ్రీయుత ఆంధ్రయువకనాయకుడగు రావినారాయణరెడ్డిగారు హైద్రాబాదునుండి శ్రీ. జి. గోపాల్‌రెడ్డిగారు మంత్రిప్రగడ వేంకటేశ్వరరావుగారు, హరిము నిష్టుగారు, శ్రీ శంకరయ్యగారు, జనగామనుండి శ్రీ ఆజీజామియాగారు బీబీనగర్ నుండి శ్రీ పి.పి. లింగయ్యగుప్త, శ్రీ యెమగని వెంకటేశంగారు వచ్చియుండిరి ప్రప్రథమమున శ్రీ కాలేరు పరశురాములుగారు ప్రార్థన గావించిరి. శ్రీ రావినారాయణరెడ్డిగారు ప్రస్తుత హైద్రాబాదు పరిస్థితుల గురించి అనర్గళ వాగ్ధోరణితో ఉపన్యసించి సభికులను ఆనందములో ముంచివైచిరి, పి.పి. లింగయ్యగుప్తగారు ఆంధ్రమహాసభోద్దేశములు వివరించిరి. శ్రీ మంత్రిప్రగడ వెంకటేశ్వరరావుగారు ధైర్యము, ధర్మము మున్నగునవి గురించి ఒకఘంటవరకు మాట్లాడిరి. స్థానికయువకుడగు శ్రీ గాయరు విశ్వనాథం మాట్లాడుచు, మేము ఒక గ్రంథాలయము స్థాపించబోవుచున్నాము అందుకు యువకులతోడ్పాటుముఖ్యఅవసరమని చెప్పుచు, వృద్ధులు కూడ ప్రతిపనికి మాకు చేయూతనివ్వవలయునని చెప్పిరి. శ్రీ శంకర్ గానుభజనను ఆహ్లాదకరముగ నొనర్చిరి. మధ్యమధ్యన శ్రీ అజీజామియాగారును హమ్మదీయులైనప్పటికిన్ని ఆంధ్రదేశమునందు జన్మించినందుకు ఆంధ్రభాషలో మృదుమధురకంఠముతో పాటలుపాడుచు సభికులను ఆనందములో ముంచివైచిరి. శ్రీ వెంకటేశ్వరరావుగారు కూడ కార్మికకర్షకుల పాటలుపాడిరి. రాత్రి ౧౧ గంటలకు స్థానికయువకుడగు కాలేరు సుదర్శనగారు యువకులకును. అతిథులకు. సభ్యులకు కృతజ్ఞతనర్పించిరి. అంతటితో సభముగిసెను

## పన్నుకై వ్యవసాయ పశువులజప్తు

(ఒ. వి.

కరీంనగరం, ఇస్ఫందారు ౧౦

౬-౪-౫౦ ఫ. నాడు కరీంనగరం తాలూకాలోని బొమ్మకల్లు గ్రామంలో మాల్గుజారీ శిస్తు క్రింద దాదాపు గ్రామంలో రైతులందరి పశువులు సుమారు ౭౫ జప్తుచేసి ఆనాడే కరీంనగరము తహసీలుకచ్చేరీకి కొనితేబడినవి. తహసీలుకంపౌండులోనుంచబడినవి. వీటిలో దాదాపు ౫౫ పశువులు వ్యవసాయపువిగలవు. ౧౦ పాలిచ్చే బర్రెలుగలవు తక్కినవి ఆవులు, దూడలు పాలిచ్చే బర్రెలదూడలు గ్రామంలోనివియుండిపోయినవి. ఇవిపంచునామాచేయకుండానే కరీంనగరముతేబడినవని తెలుస్తున్నది. తహసీలునుండి ఇద్దరుచప్రాసీలు ఈపశువులతోల్పుటకుగాను పైగ్రామానికి పంపబడిరి. జప్తుచేయుటకు రెండుదినములుముందు తహసీల్దారుగారు పైగ్రామానికి వెళ్ళియుండిరి. చేతికివచ్చినపంటనంతయు అమ్మి ఈసంవత్సరపు శిస్తుదాదాపు చెల్లించినారనియు, ఇప్పుడు జప్తుచేయబడినది చాలావరకు నిరుటిబకాయింతా రకమేననియు రైతులు చెప్పుతున్నారు. ఒక్కొక్కరైతు ౦౪౦ రూ. ౦౪౦ రూ. ౧, ౨, ౩, ౪ రూపాయలుమాత్రమే చెల్లించవలసియున్నదనియు, దీనికొరకే ఈజప్తుచేయబడినదనియు, ఒకవృద్ధ స్త్రీ రూ౧-౧-౦ ఈసంవత్సరపుదిమాత్రమే చెల్లించవలసియుండ దానిక్రిందికి ఆమెవి (౫) అయిదు పశువులుజప్తుచేయబడి తీసుకొనిరాబడినవనియు వాటిలోనొక పాలిచ్చేబర్రెగూడగలదనియు తెలుస్తున్నది. తిండికిమిగిలించుకొనక ధాన్యమంతయు అమ్మి శిస్తుచెల్లించినారనియు, ఇప్పుడువారి స్థితికష్టముగనున్నదనియు, వ్యవసాయపుపశువులు తీసుకొనిరాబడుటచేత మోటలుఆగిపోయి తాబి ఎండఫలిసివచ్చినదని సాగుబడిఆగిపోయినదనియు, రైతులుచెప్పినారు. తహసీలుదారుగారు ౫ రోజులుగడువుయిచ్చి రెండవనాడు సాయంకాలము (౭-౪-౫౦ ఫ,) పశువులను వదలినాడని తెలుస్తున్నది. జప్తులోనున్నపుడు రెండురోజులు పశువులకుమేతవేలేదు. పింఛనుపుచ్చుకున్న ఒకఉద్యోగిదారినపోతూ పశువులదీనావస్థనుచూచిజాలిపడి కొంతగడ్డికొని పశువులకువేయించిరి.

## ఖమ్మంమెట్టు

### ఆర్యసమాజప్రచారము

(ఒ-వి)          ౧౪-౧-౧౯౪౧

శ్రీ మహా పండితపూజ్య అవధ్‌బిహారీలాలుగారు రెండుమూడుదినములవరకూ ఆర్యసమాజమందిరమున మరియు ఇతరప్రాంతములయందు అమూల్యవ్యాఖ్యానమొనర్చియుండిరి.

### విద్యార్థులకు జుర్మానాలు

(ఒ.వి)

ఖమ్మంమెట్టు హైస్కూలువిద్యార్థులపైనికతినచర్యలనుగమనించియేయుందురు. రస్టికేటుచేయదలచినవిద్యార్థులలో ముగ్గురు, ఒక్కొక్కరు పదిరూపాయీలవంతునను, మిగిలినవారు ఒక్కొక్కరు అయిదురూపాయిలవంతునను జరిమానాచెల్లించి పాఠశాలయందు చేర్చుకొనబడవచ్చునని పైఅధికారులు ఉత్తరవులనుపంపిరి.

హెడ్మాష్టరుగారు విద్యార్థులు అజరిమానాయేగాక, తానువిధించినడబల్‌ఫీజు, జుర్మానా మొదలగునవన్నియు కలిపికట్టి పాఠశాలయందు చేరవచ్చునని చెప్పుచున్నారు. కొందరిని సర్టిఫికెట్టుదీసుకొనివెళ్ళుమనియు, కొందరిని పరీక్షలలో కూర్చుండబెట్ట నవసరములేదని వ్రాసియీవలెననియు నిర్బంధించుచున్నారు.

భగవానుడైనను జాలిగొని విద్యార్థుల కష్టముల నతొలగించుగాత.

### హరిజనసేవాసంఘమునకు భూరి విరాళము

(ఒ-వి)

శ్రీయుత అనుమోల వెంకటాద్రిగారు, హరిజనసేవాసంఘమువారిచే నడుపబడుచున్న పాఠశాలలలోనొకటియగు "దీనబంధు ఆంధ్రూస్ పాఠశాల" భవననిర్మాణమునకు వాగ్దానమొసంగిరి. "దీనబంధు" పాఠశాలనుకట్టించి శ్రీ వెంకటాద్రిగారు దీనులకుబంధువగుచున్నారు. వీరుబురదరాఘవపుర హరిజనసేవాసంఘమునకు అధ్యక్షులుగానుండిరి. దానినియీదినముననే యీహరిజనసేవాసంఘమునకుకలిపి అదాయమునువారికే చెందునటుల ఏర్పాటుచేసినారు. వీరిఉదారగుణము ప్రశంసనీయమైనది. శ్రీ వారికి భగవంతుడు ఆయురారోగ్యఐశ్వర్యములను ప్రసాదించిధర్మబుద్ధిన భివృద్ధిపరచుగాక.

## మిరియాలగూడెం పోలీసుదఫేదారు వింతచర్యలు

మిరియాలగూడెం తాలూకాఅగుటచే పరిసరప్రాంతములైనపల్లెలనుండి అనేకబీదలు ఉదరపోషణనిమిత్తమై కూరగాయలు మొదలగునవి ఇచ్చటికి అనగా మిరియాలగూడెమునకు అమ్మకమునిమిత్తమై తీసుకొనివచ్చెదరు- దఫేదారు సాహెబుమాత్రము తనస్వంతసొమ్మువలె వాండ్లనెత్తిమీదిబుట్టలు బలవంతముగా క్రిందికిదించి తనఅవసరమువరకుతీసుకొని అంతతో తృప్తిచెందక తనవెంటనున్న జవానుకుకూడ యిప్పించగలడు పాపము- నిరుపేదలు- తమయింటివద్ద పిల్లలకడ్పుమాడ్చి తాముసహితము తినక విక్రయలాభముతోమాత్రమే జీవనాధారముగ గడిపెదరు. లాభముసంగతిదేవుడెరుగు, అసలునుంచే దఫేదారుకైంకర్యముపట్టించిన పాపమూ నిర్భాగ్యులగతియేమికావలెనో రక్షకునకే తెలియవలెను. ఇదిగాక యీగ్రామమున ప్రత్యాదివారము సంతజరుగును. గ్రామజనులు చాలావచ్చుచుందురు. దఫేదారుసుంకమని కొంతవరకైనను చెల్లించనిచో వీధిలోగలదుకాణములు ఊరిబయటకు వెళ్ళవలసినదే- ప్రభుత్వమువారిని వేడునదేమన యిటువంటిలంచపుగొండిపోలీసులనుండి ప్రజలకు చాలయిబ్బందికలుగుచున్నది కావున ప్రభుత్వమువారు త్వరగా చర్యగైకొని విచారించి, ముందిటువంటి దుష్ప్రవర్తనలేకుండ చేయగలరని ప్రార్థన.

ఈవిషయములో స్థానిక అమీనుగారు విచారించిన తగుసాక్షులనుకూడ ఆయత్తపరచగలను-

ఇట్లు

యల్లమందఆర్య.

## అమెరికావారి సామ్రాజ్యాపహారము

గాంధిమహాత్ముడు వివరించుట

పోయిన [౧౯౪౦]అక్టోబరునెలలో బొంబాయిలోయుండిన అఖిలభారతకాంగ్రెసు పరిషత్తుసమావేశమునకు ఫ్రాన్సిస్‌హిక్‌మన్ అనువారు చూడవచ్చియుండిరి. వీరుఅమెరికా సంయుక్తరాజ్యమందలి "న్యూఆర్లియన్సు"అను స్వతంత్రపాలన వ్యవస్థగలరాష్ట్రమునకు జెందిన "ది కాటన్ ట్రేడ్ జర్నల్"అనుపత్రిక యొక్క ప్రచురణాధికారి. ఆయన గాంధిమహాత్మునితో సంభాషించిపోయెను. ఆయనతనపత్రికకు ఆసంభాషణసమాచారమును వ్రాసిపంపినాడు, అందలిరెండుఅంశములు ఇక్కడ తెలుపబడుచున్నవి.

హిక్‌మన్‌గారు గాంధిగారిని, భారతదేశపువారు భారతదేశపుసమాచారము ఇప్పటికంటె మంచిగా అమెరికావారలకు తెలియునట్లుచేయుటకు ఎందుకుయత్నించరాదని అడిగిరట. అందుకు గాంధీగారుభారతదేశపువారలు ప్రయత్నించినారుకాని అమెరికావారలు అంతకంటెముందుగా బ్రిటిషుసామ్రాజ్య మనుకారముగలవారలు చెప్పినదానిని నమ్మియుండుటవల్ల, ఈప్రయత్నములు ఫలించలేదని సమాధానమిచ్చిరి. అమెరికావారికేగనుక నిజంగా భారతదేశమునుగూర్చి ఇప్పుడుతెలిసియున్నదానికంటె ఎక్కువ తెలిసికొనవలెనను అపేక్షయున్నచో, క్రొత్తగారచితములైనపుస్తకములెన్నియో దొరకగలవనియు మరియు జరుగుచున్న సమాచారములను తెలిసికొనవచ్చుననియు గాంధిగారుచెప్పిరి. బ్రిటనుతర్వాత అమెరికావారు ఎక్కువగా సామ్రాజ్యమనుకారముగలవారుగానుండయున్నారాఅని తానాశ్చర్యపడుచుంటినని మహాత్ముడు చెప్పెను. అమెరికాదేశపువారు భారతదేశమును స్వతంత్రరాజ్యమునుగా సన్మానించిన బాగుండుననియు, ఇతరులకు భోగ్యదేశమాత్రముగ భావించబడకుండిన బాగుండుననియు మహాత్ముడుచెప్పెను. అనగా అమెరికావారలు స్వదేశమును ఇతరులేవిధముగ చూడవలెనని కాంక్షింతురో అదేవిధముగ తాముకు భారతదేశమును చూడవలెననిఅర్థమనిరి.

## ఇండియాలో శిశుపోషణ లోపము

ప్రతిఏట పదిలక్షుల శిశువుల మరణాలు

"ఇండియన్ రీసర్చిఫండ్ అసోసియేషన్" అను సంఘముచే ఏర్పాటు చేయబడిన పుష్టికరాహారపరిశోధన కార్యమునకు డైరెక్టరుఅగు డాక్టరు డబ్ల్యు ఆర్. ఐక్రాయిడ్ (యం.డి, యస్సి., డి.)గారు పాట్నాలో పాట్నా విద్యాపీఠమువారిచే ఉపన్యసించుటకొఅకు పిలిపించబడి, ఉపన్యాసమిచ్చినపుడు భారతదేశంలో శిశువులకు సరిగాపోషణనిచ్చే ఆహారము యివ్వబడుచుండుటలేదనిచెప్పిరి. అందుచే ప్రతిఏట పదిలక్షలమందిశిశువులు ఒకఏడాది ఈడువచ్చులోగానే మరణించుచున్నారనిరి. తల్లుల మరణాలసంఖ్యకూడ హెచ్చుగానున్నదనిరి. బ్రిటిషుఇండియాలో ప్రతిఏట ౨౦౧౦౦౦మంది తల్లులు మరణించుచున్నారని అంచనాలుకట్టబడినట్లు చెప్పిరి కాని ఈదేశములు చాలాచోట్ల సరిగా లెక్కలు వ్రాసియుంచుటలేదనియు, అందువల్ల తానుచెప్పినది అంచనామాత్రమేయనియుచెప్పిరి. ప్రతి౧౦౦౦ పుట్టుకలకు ౨౪ మరణములున్నవనిన సత్యమునకు ఎక్కువ దూరులము కాకుండుమనిరి ౧౯౧౨ వ ౧౯౩౫సంవత్సరములమధ్య ఇంగ్లాండులో ప్రతి౧౦౦౦మందికి ౪మందితల్లులు మరణించుచుండిరి. అవిమొదలుకొని ప్రసవదోషముల చికిత్సలో "సల్ఫానిలమైడ్" అనుదానిని ఉపయోగించుటకు ప్రారంభించినందువల్లఇపుడు తల్లులమరణము అంతకంటె తగ్గినదనిరి.

ఉత్తమాహారము

శిసువులకు తల్లిపాలే శ్రేష్ఠతమమైన ఆహారమని ఐక్రాయిడ్‌గారుచెప్పిరి. ఇది అనుభవసిద్ధమేగాక సైన్సు పరిశోధనలవల్లకూడ ధ్రువపడినదనిరి. మలయాలో పిల్లలకు పాలిచ్చువాళ్లులు "కార్ఖో బియ్యము"ను అనగా గిర్నిలలో తక్కువపోటుమాత్రమే వేయబడినందువల్ల 'ఒవ బి' అనే విటమినుపదార్థము ఎక్కువగా ఉండు బియ్యమును తినునట్లు చేయబడిన తర్వాత కొన్నిఏండ్లకు చూడగా శిశుమరణసంఖ్య చాలాతగ్గిపోయెనని చెప్పిరి. ౧౯౩౯లో మొదటిఆరునెలలకు వేయింటికి ౭౦మంది శిశువులు మాత్రమే మరణించినారు అసియాఖండంలో మరే దేశంలోకూడ ఇంతతక్కువ మరణసంఖ్య ఉండకపోవచ్చును కొన్ని తూర్పు దేశాలలోకంటె ఇండియాలోశిశువులకువచ్చే 'బెరిబెరి' అనే వ్యాధీ చాల తక్కువ. ఎందువల్లనంటే ఇండియాలో వరిఅన్నము తినేవారిలో 'ఉప్పుడుబియ్యము' (అనగా ఉడుకబెట్టినతర్వాత గిర్నిలలో దంచబడిన వడ్లబియ్యము) తినేవారే ఎక్కువమంది ఉన్నారు అట్టిబియ్యము గిర్నిలలోనుండియే వచ్చినను వాటిలో '౧వబి' అను విటమిను పదార్థము అట్లే నిలచియుండును.

## షోలాపూరులో రాత్రిసంచార నిషేధము

బొంబాయిరాష్ట్రిమందలి షోలాపూరు నగరములో వేర్వేరుమతస్థులలో పరస్పరద్వేషము ఉద్రేకించి జనవరి ౧౫వతేదిన ఒకరి నొకరుపొడుచుకొనినందుచే ౭ మరణించుటయు, ౫ మందికి గాయములుతగులుటయు సంభవించినది. ఆజిల్లా మేజిస్ట్రేటు అందుమీదట రాత్రిపూట ౭౻గం. ల నుండి తెల్లవారిజామున ౫౻ గం. ల వరకును ఎవరును యిండ్లబయటసంచరించరాదను ఆజ్ఞచేసినారు. మరియు ఆ అధికారి హిందూ ముసల్మానునాయకులను తనఆఫీసుకుపిలిపించుకొని పరిస్థితులను వివరించి, శాంతిస్థాపనలో వారలతోడ్పాటు నర్థించినాడు.

## "రెండో ప్రపంచ యుద్ధమా?"

౨౪౦ పుటలు, ప్రపంచపటము. రెండుభాగముల వెల రు ౦-౧౨-౦

వివరములకు:- ౧౬౮ సుల్తాన్‌బజారు ఆంధ్రకేసరి గ్రంథమాల: హైద్రాబాదు. ద.

## హిందీ, ఉర్దూల అభిమానుల ద్వేషాలు

తలపగులగొట్టే బెదరింపులు

సంయుక్తరాష్ట్రింలోని లక్నోలో ఆలిండియారేడియో (అఖిలభారతదేశపు ఆకాశవాణి) లో హిందూస్థానీభాషలో బ్రాడ్‌కాస్టుచేయదలచగా హిందీఅభిమానులను ఉర్దూఅభిమానులు వాదులాడుకొనసాగినారు. వాక్కలహములు తలలు పగులగొట్టెదమను బెదరింపులకు దిగినవి. అఖిల భారతయాకాశవాణి అధికారు హమారీబోలి అనుదానిని వ్యాప్తికిదెచ్చి యిరుజగలవారిని సంతోషపెట్టుటకు చూచినారుగాని ప్రతితెగవారును తమ అభిమానభాషను శుద్ధముగానుంచి బ్రాడ్‌కాస్టుచేయవలెనను పట్టుదుమానలేదు. "ఆకాశ్‌వాని"అను ఒకపత్రిక యొక్క సంపాదకుడగు జగదంబాప్రసాద్ హితేషిగారు శుద్ధమైనహిందూస్థానీలో బ్రాడ్‌కాస్టు చేయవలెనని వాదించువారు ఒకరోజు వారికి ఉర్దూలో ఎట్టిసిరాలో వ్రాసినఒకలేఖచేరెను. అందులో అసంపాదకుడు "తనదుష్టమైన మతద్వేష కరచర్య" మాననిచో ఆతనిని అకస్మికముగను క్రూరముగను చంపెదనని" బెదరింపుచేయబడినది. అలేఖను యే ఆకాశరామన్న వ్రాసినాడో పేరులేదట. అజాబును ఇపుడు పోలీసువారు చిక్కించుకొని అదివ్రాసినవానికొఅకై శోధనచేయుచున్నారు.

## మహారాజకుమారులకొఅకై రూ ౬౦౦౦౦ ల రైలుబండి

టిక్కెటులేకుండా పోయినందుకై మహారాజుగారికి వినోదశిక్ష

గాయక్వాడుమహారాజుగారి ఇరువురికుమారులను రాజనగరావరణంలోనే, నివాసస్థమునుండి ౬ మైళ్ళదూరములోనుండే బడికితీసికొనిపోవుటకై రాజనగరపుద్రవ్యమునుండి రూ ౬౦౦౦౦ లు ఖర్చుచేసి ఒకరైలుబండిచేయించినారు. అందులో రెండుపెట్టెలుండును ఒక్కొక్క పెట్టెవెడల్పు ౩ అడుగులు, పొడుగు ౧౨ అడుగులు వాటిని నాలుగడుగులఎత్తుగల చిన్నయింజనులాగును, పైలుబాటపై పట్టాలమధ్యసందు ౩ అడుగు. ౯౦ అటెతక్కువ అరుమైళ్ళకు అరుచిన్న స్టేషనులేర్పరచబడినవి.

జనవరి ౧౧ వతేదిన అరైలుబండిలో మహారాజుగారుకూడప్రయాణమైరి. బండిబడివద్దకుచేరగానే, ౧౨ యేండ్లవయస్సుగలయువరాజు టిక్కెట్టుఇన్స్పెక్టరువలె నటించుచు టిక్కెట్టుచూపించవలసినదనితండ్రియగు మహారాజుగారినడిగెను. వారు టిక్కెటులేదనిచెప్పగా, టిక్కెట్టులేకుండ ప్రయాణముచేసినదోషానికై రెండింతలచార్జి చెల్లించవలసినదనియువరాజుఅడిగెను. ఆరెండింతలచార్జిచెల్లించగలనని మహారాజు మాటయిచ్చువరకు యువరాజువారిని ప్లాటుఫారం మీదినుండిపోనీయలేదు.

# ప్లేగు వ్యాప్తి

ప్రజలకు హెచ్చరిక

జిల్లాలలో ప్లేగుఉండు గ్రామములనుంచి ప్రజలు పట్టణములోనికివచ్చుటవలన హైద్రాబాదులో ప్లేగువ్యాపించుచున్నది.

ఈవ్యాధి ప్రజలసహాయమువలన ఎక్కువగా వ్యాపించక అణచివేయవచ్చునని ప్లేగు డిపార్టుమెంటువారు దృఢముగా నమ్ముచున్నారు.

ప్లేగువ్యాధియున్నప్పుడు ఎలుకగాని, ఉడతగాని, కోతిగాని, పిల్లిగాని ఏఇంటిలోనైన పడినప్పుడు, లేక చచ్చినప్పుడు లేక ప్లేగుతో ఏమనిషియైన పడియున్నప్పుడు ఆఇంటివారు తక్షణమే ప్లేగుడిపార్టుమెంటుకు చెందినసబ్ అసిస్టెంట్ సర్జనుకు లేక హెల్త్ఇన్స్పెక్టర్ లేక సఫాయి అమీనుకు తెలియపరచవలయును.

ప్లేగువ్యాధివలన బాధకలిగినదని తెలియపరచిన ఆరుగంటలవరకు ప్లేగుతో చనిపోయిన మనిషియొక్క శవమును, సమాధిగాని, దహనముగాని చేయగూడదు.

ఇంతకుముందు ప్లేగులేనిస్థలమునందు డాక్టరుగాని, హకీంగాని, వైద్యుడుగాని, ప్లేగురోగిని చూచుటకుగాని, ఔషధమిచ్చుటకుగాని పోయినప్పుడు ఆసమాచారము స్పెషల్ప్లేగుఆఫీసరుకు తక్షణము వ్రాతమూలకముగా తెలియపరచవలెను. అట్లు తెలియపరచినవారికి ఒకరూపాయి బహుమానముగా యివ్వబడును. ప్లేగు రోగికి మందుయిచ్చువారు ఆరోగియొక్క అడ్రసు స్పెషల్ప్లేగుఆఫీసరుకు తెలియపరచవలెను.

ప్లేగువచ్చిన యింటిలోనుంచి, సఫాయిహద్దులోనున్న మరి ఏ యింటిలోనికి ఎవరును పోగూడదు.

ప్లేగువున్న స్థలమునుంచి ప్లేగులేని స్థలమునకు ఎవరునుపోకూడదు, మరియు ప్లేగున్నస్థలమునుంచి చుట్టములను, స్నేహితులను పట్టణములోనున్నవారు ఎవరును చేర్చకూడదు. అట్లు ప్లేగుస్థలమునుంచి మంచిస్థలమునకు వచ్చుటవలన వారిపరుపులు, బట్టలు మొదలగు వస్తువులమూలముగా ప్లేగుపురుగులువ్యాపించి ప్లేగు కలుగజేయును.

ప్రతివారు ప్లేగుటీకాలు తీయించుకోవలయును. స్పెషల్ప్లేగుఆఫీసులో, ప్రతిసర్కారీ దవాఖానాలో, ప్లేగుఆయినస్థలములలోను ఈ టీకాలుతీయబడును.

తమయింటిలోగాని, చుట్టుప్రక్కలలోగాని ఎలుకలుపడగానే లేక ప్లేగు మనుష్యులకుకాగానే హెల్త్క్యాంపులకు పోయియుండవలయును.

ఎలుకలను చంపుట,ఎలుకల కన్నములకు పొగపట్టుట మొదలగు ప్లేగునివారణ పనులయందు ప్రజలందరు సహాయపడవలెనని ఇందుమూలముగా హెచ్చరింపబడినది.

ప్లేగుకమీషనర్
(హైద్రాబాదు-దక్కన్)

# నిజాంరాష్ట్ర పద్మశాలి యువజనసంఘము

శ్రీ రాజాబహదర్ వెంకట రామారెడ్డి ఓ. బి. ఇ. గారిని గూర్చి అభినందనతీర్మానము

హైదరాబాదు (దక్కన్), జనవరి ౧౮

"నిజాంరాష్ట్రముయొక్క ప్రముఖులగు శ్రీరాజాబహదుర్ వెంకటరామారెడ్డిగారు గతమాసము అనారోగ్యమువలన చికిత్సకొరకై మద్రాసుపట్టణమువెళ్లి భగవంతుని కృపవలన శీఘ్రముగా ఆరోగ్యమునుబొంది నిన్నటిదినము తిరిగి మనపట్టణమునకువచ్చినందుకు, ఈ సంఘమువారు మిక్కిలి సంతసించుచు శ్రీరాజాబహదుర్ గారి ఆరోగ్యమునకుఅభినందించుచు,శ్రీవారికి ఈశ్వరుడు దీర్ఘాయువు నొసంగుగాక యని ప్రార్థించుచున్నారు" అనుతీర్మానము నేడుసాయంకాలము నారాయణగూడెములో నిజాంరాష్ట్రపద్మశాలియువజనసంఘ సమావేశములో ఆమోదించబడినది.

మరియొక అభినందనతీర్మానము ఇట్లు చేయబడినది:—

నిజాంరాష్ట్రప్రాంతీయులును, పద్మశాలినాయకులునగు శ్రీయుత పులి మల్లయ్యగారు షోలాపురపట్టణముయొక్క పురపాలక (Munici pality) సంఘాధ్యక్షులుగా నెన్నుకోబడినందుకు ఈసంఘమువారు మిగుల సంతసించుచు హృదయపూర్వకముగా శ్రీవారిని యభినందించుచు, ఈశ్వరుడు వారి కర్తవ్యములను జయప్రదముగా నెరవేర్చుటకు శక్తి నొసంగుగాక యని ప్రార్థించుచున్నారు. శ్రీవారు పద్మశాలియువకులలో మొదటివారు, నిట్టిగౌరవస్థానమునలంకరించినందుకు ఈయువజనసంఘమువారు నెంతయో గౌరవించుచు ఆనందించుచున్నారు."

కిషన్‌గంజు ఆర్యసమాజం

హైదరాబాదు జనవరి ౧౯

లోగా ౧౫ వ జనవరితేది ఏర్పాటయియుండెను కాని ఆనాడురావలసినమంది సభాసదులు రాకపోవుటవలన తిరిగి విక్రమనామసంవత్సరపు పుష్య బ ౧౫ అమావాస్యసోమవారమునకుసరియగు ౨౭ వజనవరితేదిఎన్నికలకు ఏర్పాటయియున్నది. ఈసారికోరం(రావలసినంతసంఖ్య) పూర్తియైనను లేకపోయినను శ్రీప్రధానిగారి అజ్ఞానుసారము వార్షికఎన్నికలు జరిగితీరును.

ఇట్లు
శంకరరెడ్డి

# సంస్కరణ వివాహము

౧౯౪౧సం॥ జనవరి౧౨తేది సోమవారము ఉదయము ౭-౩౦నుండి ౯-౩౦ వరకు సికిందరాబాదు ఆర్యసమాజముపక్షమున నొకసంస్కరణ వివాహము జయప్రదముగాజరుపబడెను. వధువు శ్రీమతి రత్నాబాయికన్య ౧౯ వత్సరముల వయస్సుకలది. శ్రీయుత గంధం వీరరాఘవులునాయుడుగారికొమార్తె- వరుడు మిస్టరు జోజెఫు ౨౪సంవత్సరముల క్రైస్తవయువకుడు, మిస్టర్ఫ్రాన్సిసుగారి కుమారుడు ఉభయపక్షములవారును సికిందరాబాదుపౌరులు బాగుగా నెరిగిన మర్యాదగలకుటుంబములకు జెందినవారు. వధూవరులొండొరులను ప్రేమించి పెండ్లియాడ స్థానిక ఆర్యసమాజమును ప్రార్థించినందున తత్సమాజమువారు ఇట్టి వర్ణాంతరవివాహమును జరిపిరి. వధూవరులిరువురును విద్యావంతులు, వరుడు ప్రసిద్ధికెక్కిన ఆర్టిస్టు (చిత్రకారుడు) ఫోటోగ్రాఫరును వివాహవిషయిక ప్రకటనకై కొద్దికాలమేయుండినను స్త్రీపురుష ప్రేక్షకులు రెండువందలకుమించియుండిరి, వివాహమునకు పూర్వము దంపతులు ఆర్యసమాజసభ్యులై సమాజ నియమములను పాలింతుమనియు, ఉభయులు తమ ఇష్టానుసారముగా పెండ్లి చేసికొనుచున్నామనియు లిఖితరూపముగా అధ్యక్షులకు ప్రతిజ్ఞాపత్రముల నర్పించిరి. వివాహాదిలో వరుడు కొంతకాలమునుండి వైదికధర్మముపై ప్రేమయు భక్తియును కలిగియున్నవాడని అందుపై వైదికరీత్యా పెండ్లాడుచున్నాడని ప్రేక్షకులకువిశదీకరించెను. సంస్కారమునకు ముందు వరునకు ప్రాయశ్చిత్త యజ్ఞోపవీతసంస్కారము జరుపబడెను తదుపరి వివాహమంత్రములతో హవనము. మాంగళ్యధారణ, లాజహోమము, సప్తపదేత్యాదులతో వివాహము సమాప్తమయ్యెను. వరునికి 'జనార్దను' నామ మియ్యబడెను. సంస్కారము పండిత లక్ష్మయ్యగారిచే జరుపబడెను. వివాహానంతరము అధ్యక్షులగు శ్రీయుత వాసుదేవ మొదల్యారుగారు ఆర్యసమాజనియమములపై సంక్షిప్తముగాను ఏతద్వివాహ మెటుల ననుకూలించినదియు నుపన్యసించిరి. గౌరవనీయులగు శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులువారు ఉచితరీతిని వివాహమును ప్రశంసించి వధూవరుల నాశీర్వదించిరి. తదుపరి శ్రీయుత శ్యామరావుగారు తమవైజ హాస్యరసముతో నుపన్యసించి ప్రేక్షకుల నానందపరచిరి. ఈ సంస్కరణవివాహమును జూడ చాలామంది క్రైస్తవులే తెంచిరి. ఉపహారవిందుతో వివాహము సమాప్తమయ్యెను.

# కలియుగభీమ ప్రొఫెసర్ లక్ష్మీనారాయణగారు

అత్యద్భుతమగు బలప్రదర్శక పోటీ-

సికింద్రాబాదు దక్కన్ జనవరి ౧౫

మహారాజ శ్రీరాయబహద్దూర్ రాజా శ్రీకిషన్‌సుఖదేవుగారి సమక్షమున ఆంధ్రవీర కంఠీరవుడగు ప్రొఫెసరు లక్ష్మీనారాయణ కాండో కలియుగ భీమగారికిన్ని అజేయుడగు బొంబాయికాండో ప్రొఫెసరు వి. యచ్. షాహ గారికిని లోగా పోటీదినము ౧౬, ౧౭ జనవరులనాడు ఏర్పాటు అయిఉండెనుగాని రెసిడెంటువారి యాజమాన్యమున జరుగు యుద్ధసంఘమువారు అవ్యధానియమించినందున ప్రస్తుతము ౨౫ జనవరినాడు సాయంత్రం ౫-౩౦ గంటలకు ఏర్పాటుగాబడినది. ఈపోటీ సికింద్రాబాదులో బాయ్సుస్కౌటు హెడ్ క్వార్టర్సువద్ద, పెరేడుమైదానంలో జరుగును.

బొల్లారం ఆర్యకుమారసభ

సికింద్రాబాదు జనవరి ౧౬

నేటిదినము బొల్లారములో ఆర్యకుమారసభవారి ౧౯౪౧ సంవత్సరపుఎన్నికలుజరిగెను. దానిలో శ్రీయుత సేటుబాలకిషన్‌గారు ప్రధానులు, పండితరామదేవు సిద్ధాంతవాచస్పతిగారుఉపప్రధానులు జి. వి. ఓంకారనాథ్‌గారు మంత్రిగా ఎన్నుకొనబడిరి.

# జనాభాలో విశ్వబ్రాహ్మణులకు సూచన

ఇదివరకులోగా మ-ఘు-వ-నిజాంప్రభుత్వమువారు జనపరిగణ [మర్దుంషుమారి]జరిగినసమయములలో జనాభపట్టికయందు విశ్వబ్రాహ్మణులను కమ్మర, వడ్ల, కంచరి, కౌశ, అవుసలి, యని శూద్రాదివివిధజాతులతో పాటువిశ్వబ్రాహ్మణులనుగణించినట్లువినియున్నాము. కావున ఇనుము, కఱ్ఱ, ఇత్తడి, రాతి, బంగారు, ఇత్యాది పనులజేయువిశ్వబ్రాహ్మణులకు తెలియజేయునదేమనగ [౧౬-౨౭-౨౮పర్యంత ౧౩౫౦) జనపరిగణన జరుగును అట్టిసమయమందు తామెల్లరు యదార్థముగా విశ్వబ్రాహ్మణులమనిజెప్పి కమ్మరమనియు, వడ్రంగులమనియు, కంచర్లమనియు, కౌశలమనియు, అవుసలులమనియుజెప్పక వ్రాయించగలరు.

ఇట్లు
హైద్రాబాదు విశ్వబ్రాహ్మణసేవా సంఘాధ్యక్షుడు

యూనానీవైద్యశాల

హైదరాబాదు ఇస్ఫందారు ౧౬

బీదవారిసౌకర్యార్థము కొత్త నాంపల్లిలో ఒక యూనానీవైద్యాలయము స్థాపింపబడినది.

## మధిర

### శ్రీవైకుంఠ ఏకాదశి- బక్రీదుపండుగ

(ఓ-వి) ౧౬-౧-౧౯౪౧

౧౩ జనవరినాడు మాగ్రామంలో నాకు తెలిసినంతలో ౩౦ సం॥ములనుంచి చౌరస్తాలో నిర్మింపబడు కొఠారిలో శ్రీ సీతారామస్వామివారి ఉత్సవముజరుగుచుండెను. ఈసంవత్సరం శ్రీవైకుంఠఏకాదశి, మహమ్మదీయులబక్రీదు (ఈదుల్ జ్వహా)పండుగ (ది ౯-౧-౪౧ ఫ ౭-౪-౫౦ఫ) ఒకరోజుఅయినప్పటికి దయామయులైనటువంటి న్ని నిష్పక్షులైన శ్రీతాహశీలుదారుగారు చౌరస్తాలో కొఠారి పందిరిని నిర్మించుకొనుటకు ఏలాంటినిబంధనలులేకుండ హుకుందయచేసిరి. అట్లునిర్మింపబడినకొఠారిలో గురువారం తెల్లవారుసరికి శ్రీసీతారామస్వామివారిని వేంచేపుచేసి అతివైభవముగా భజనసంగీతవాద్యములతో ఉత్సవముజరుగుచుండెను. అట్టితరి స్థానికాధికారులును స్థానికమహమ్మదీయులు ప్రముఖహిందువులునుకలిసి ప్రార్థనకై ఈదుగా [దర్గ]వద్దకు మేళతాళములతో వెళ్ళుతు కొఠారిలోజరుగుచున్న శ్రీస్వామివారిఉత్సవమునువీక్షించిఆనందించుచు వెళ్ళిరి ఈదృశ్యముజూచినవారికి ఈగ్రామమందు హిందుముస్లింఐక్యత అధికార్ల నిష్పక్షకమునకు వింతఆనందముకలిగించెను. ఆదేరోజురాత్రి ౯ గంటలకు హరికథాకాలక్షేపమునకు పురవాసులఆహ్వానముపై శ్రీకోర్టుమునసిబుగారు, శ్రీ తహశీలుదారుగారు శ్రీపేష్కారుగారు మొదలైనఅధికారవర్గమంతా విచ్చేయగా రైతుసంఘాధ్యక్షులైన శ్రీసి. హెచ్. హనుమయ్యగారు ప్లీడర్లయిన శ్రీ కే. శేషగిరిరావుగారు శ్రీపురుషోత్తమరావుగారు శ్రీ వెంకటకృష్ణయ్యగారు స్వాగతమొసగిరి. కథానంతరం రైతుసంఘాధ్యక్షులును కార్యనిర్వాహకులైన కే.నర్సయ్య, కే-రామకోటయ్య. వి-వి-చౌదరి, ఏ-వి-శాస్త్రిగార్లు శ్రీతహశీలుదారుసాహెబుగారు శ్రీకోర్టుమునసబుగారు ముస్లింలైనను కథకువిచ్చేసి మాకు ఆనందముకలిగించినందులకు వారినిష్పక్షకప్రవర్తనమునకు పాపము పక్షపాతులై కలహములకు కారకులయ్యే అధికారుల మార్గావరోధకులైనందులకు అభివందించు తదితరసభికులకు చందనతాంబూలాదులొసంగి కృతజ్ఞతాభివందనములుసమర్పించిరి. ౧౦ వ తేది బ్రాహ్మణసమారాధన జరుపబడెను.

ఇట్లేఏటేట ప్రతిఉత్సవము నిర్విఘ్నముగా జరుపుటకు శ్రీసీతారామస్వామిని ప్రార్థించుచుంటిని.

---

## పాల్వంచ సంస్థానము

### అభినందన సమావేశము- సన్మానములు

(స్వ.వి.) పాల్వంచ, ౧౨-౪-౫౦

ఈసంస్థాన విద్యాధికారులును, ఆంధ్రవాఙ్మయసేవాసమితి కార్యదర్శులును, పాల్వంచగ్రంథాలయాధ్యక్షులును. కమనూరుగ్రంథాలయ సంస్థాపకులునగు శ్రీ ముత కొత్తపల్లి వెంకటరామలక్ష్మీనారాయణ శర్మగారికి శ్రీ జయపురాధీశ్వరులును, సాహిత్యసామ్రాట్టులునగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులంగారి సమక్షమున 'సాహిత్యవిశారద' బిరుదపత్రమును గావించిన శ్రీ ఆంధ్రభారతీతీర్థవారికి కృతజ్ఞత తెల్పుచు, శ్రీశర్మగారి నభినందించుటకును ౧౪-౧-౪౧ (౧౦-౪-౫౦ఫ) సాయంకాలము ౪గంటలకు శ్రీ అశ్వారావుపేట భాషానిలయ భవనమందు ఎల్లగరు అలంకరింపబడినది. ఇదస శ్రీ సంస్థానాధీశ్వరులవారి బంగళాయందు సన్మాన సమావేశము జరుపబడినది. వివిధ ప్రాంతముల నుండి పలువురు ప్రముఖులు విచ్చేసిరి.

దైవప్రార్థనానంతరము అహ్వానసంఘమువారి తరపున శ్రీ డాక్టరు బాబూరావుగారు శ్రీ శర్మగారినిగురించి ప్రసంగించుచు, శ్రీ శర్మగారు ఏలూరులో విద్యాసంపదనుగడించి, ఆంధ్రజాతీయవిద్యాలయమునకు వ్యవహర్తగను, ఉపాధ్యాయులుగను, గ్రంథాలయాధిపతిగను.పనిచేసి ౧౯౩౫సంవత్సరమున, విద్యావిషయకముగ చాల వెనుకబడియున్న మన్నెపు ప్రాంతమనదగు నీ పాల్వంచసంస్థానమునందలి అమరవరము గ్రామములో పౌరుల ఆహ్వానమునుసరించి శ్రమయనకవచ్చి, ఆంధ్రగౌతమ్యాశ్రమమును నొకభాషా సంస్థను స్థాపించి భాషాప్రచారమునకు గడంగిరి. కృతజ్ఞులనియు, ఏభాషలోగాని సర్వబాక్షిచేయుటవల్లనే ఘనతకల్గుననియు. శ్రీశర్మగారిని, ఇక్కడివారు. అనేకప్రాంతముల విద్యాధికులు, అధికారులును, గౌరవించుటకు కారణమిదియేయనియు నుడివిరి.

పిదప పాల్వంచగ్రంథాలయపక్షమున వనం వెంకట్రామనరసింహంగారు సన్మాన పద్యముల జదివి, ఆంగ్లవిజ్ఞానసర్వస్వ ప్రథమ సంపుటమును శ్రీశర్మగారికి బహూకరించిరి. కమనూరు గ్రంథాలయపక్షమున శ్రీ చిల్కూరి సుబ్బారావుగారును సన్మానపద్యములతో శ్రీశర్మగారి నభినందించి 'ఆంధ్రవిజ్ఞానసర్వస్వ' ద్వితీయసంపుటమును బహూకరించిరి. అశ్వారావుపేటగ్రంథాలయపక్షమున అటవీప్రముఖుల అభినందనపత్రమునుచదివి, శ్రీ రాజా కంచిమళ్ళ వెంకట్రామారావుబహద్దరు జమీందారువారి సందేశమునువినిపించి శ్రీగారు సన్మానరూపముగ పంచెలచాపు బహుమానములను. వినాయకపురంపటేలును, భూస్వాములునగు శ్రీ వల్లభనేనివీరయ్యగారంపిన యిరువదియైదురూప్యములను, శ్రీ నుసుపాన రామమూర్తిగారు సభాముఖమున సమర్పించిరి, రుద్రంకోటగ్రంథాలయపక్షమున శ్రీ యామునజాల వెంకటశాస్త్రిగారు శ్రీ శర్మగారి నభినందించుచు 'పండితారాధ్య చరిత్రము' బహూకరణముగా నొసగిరి.

తదుపరి ౧౯౩౬-లో కుక్కునూరున ప్రముఖులతోడ్పాటుతో శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయమును స్థాపించి, సాహిత్యవిద్యావిషయక ప్రచారమును గావించిరనియు, సగర్వస్థితమున ఆగ్రంథాలయమును పరశురామప్రీతి కాగా మరల రెండువేలపుస్తకముల ననేకశ్రమలకోర్చి సమకూర్చి పునస్థాపించిరనియు, అదియుగాక స్వయంకృషివల్లనే ౧౯౩౭సంవత్సరమున సంస్థానవిద్యాధికారిత్వమును సంపాదించి, బ్రిటిషుగవర్నమెంటు నైజాంగవర్నమెంటువారి పాఠశాలానిర్మాణ నియమములను క్రోడీకరించి సంస్థానమున ప్రాథమిక విద్యాప్రచారమును సాగించి, అధికారులమన్ననలకు పాత్రులయిరనియు. మరియు బూర్గంపాడునందు ఆంధ్రవాఙ్మయసేవాసమితికి స్థాపకులై సాహిత్యసంపుటియగు 'కిన్నెర' అను గ్రంథమును వెలువరించి సాహిత్యకృషి చేసిరనియు నిట్టివారికి శ్రీ భారతీతీర్థవారు 'సాహిత్యవిశారద' అను బిరుదొసంగి గౌరవించుట మనకెల్లరకు నభినందింపదగువిషయమనియు, మాఆహ్వానమునంగీకరించి మీరంతయుశ్రమయనక విచ్చేయుట ముదావహమనియు, ముఖ్యముగా మన డివిజనల్ఆఫీసరుగారు మేమడిగినంతనే అధ్యక్షులుగనుండుటెంతో భాగ్యమనియు శ్రీవారు అధ్యక్షపదవినిస్వీకరించి కార్యక్రమమునునొనసాగింపకోరుచున్నామనియు నుడువుచు, అధ్యక్షులను, శ్రీశర్మగారిని పూలమాలలతో నలంకరించిరి. సి. ఆర్. రెడ్డిగారును. సర్ ముత్తాగారును. సర్ రాధాకృష్ణ పండితులు. ఆర్. రంగనాథన్‌గారు, శ్రీపీఠాపురం యువరాజావారు, పండిత ఆదిరాజు వీరభద్రరావుగారును. శ్రీ వేదులసత్యనారాయణశాస్త్రిగారును శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారును, శ్రీ సి. హెచ్. రామమూర్తి బి.ఏ. గారును శ్రీ అచ్యుతన్న నరసింహారావుగారును మున్నగువారు సమాల్య సందేశముల నంపిరి.

తరువాత శ్రీశర్మగారుతమనీడ్చి "ఆంధ్రభారతీతీర్థవారు" వివిధభాషా సంస్థలవారు, కవులు. పండితులు ప్రముఖులు, అభినందించినందులకు సన్మానించినందులకును కృతజ్ఞతనువెల్లడించుచు తమకొనరించిన యీగౌరవము తమకు సంబంధించినసంస్థలకే చెల్లుననియు, అల్పజ్ఞుడగు తనకేమియుగొప్పతనములేదనియు, ఈ బిరుదప్రదానముచే తనకార్యభారము హెచ్చినదిగా తలంచుచుంటిమనియు, తామీప్రాంతమున జేసినదానికన్న చేయవలసినసేవ యెక్కువగానున్నదనియు, దానికిప్రజలు ప్రభుత్వము చేయూతనొసగవలెననియు సంస్థానమునందిట్టి అపూర్వమైన సాహిత్యధనమయికసమావేశమునకు అధ్యక్షతవహించి అమూల్యోపదేశములనొసగి సభా విజయమునకు తోడ్పడిన శ్రీ డివిజనల్ఆఫీసరుగారికిని. ఈసమావేశమునకు ముందంజవేసి సర్వప్రయత్నములు జేసి తననీరీతి సన్మానించుటకు కారణభూతులైన పాల్వంచగ్రంథాలయసభ్యులకును, సన్మానమునొసఁగినవారికిని వందనము లర్పించుచు సన్మానరూపముగనొసంగిన ద్రవ్యముతో ఆంధ్రవాఙ్మయసేవకి నూతనాలంకారముల సమకూర్పగలమనియు ప్రత్యుత్తరమిచ్చిరి.

అంతట జయజయధ్వానములతో సమావేశము పరిసమాప్తి నొందింపబడినది.

### అధ్యక్షులగు జనాబు మహమ్మద్ గులాం మహమూద్‌ఖాన్ డివిజన్ ఆఫీసరుగారి ఉపన్యాసము

"సోదరులారా!

ఈసమావేశానికి చాలామంది అధికారులు విద్యాధికులు, పెద్దలు, ఇతరప్రాంత ప్రముఖులు దయచేశారు. ఇందులో తెలుగువారు బహుసంఖ్యాకులు. అందరికీ తెలిసేటట్లు తెలుగులో ఉపన్యాసంచేయలేనందులకు విచారిస్తున్నాను. నాకు తెలిసిననాలుగుముక్కలు ఉర్దూభాషలో చెప్పెదను.

మనప్రాంతంలో, అందులో మనపాల్వంచ సంస్థానంలో, ఇలాంటిసభలు జరుగడం చాలా అరుదు. ఇట్టిప్రాముఖ్యత మనసంస్థానానికిఅబ్బడం మనఅదృష్టమనాలి. శ్రీశర్మగారు చాలాకాలంనుంచి ఈప్రాంతంలో అమోఘమైన కృషిచేయుచుండుటవల్లనే, వారికి శ్రీ భారతీతీర్థవారు 'సాహిత్యవిశారద' అనే బిరుదిచ్చి సన్మానించారు, వారికిమనమందరము కృతజ్ఞులము. ఇలాంటి విషయం మనఅందరికీ విద్యాప్రోత్సాహాన్ని కలిగిస్తుందని చెప్పాలి.

నేనుచదువుకు నేరోజుల్లో మనదేశంలో అయిదు విశ్వవిద్యాలయాలుమాత్రంవుండేవి. యాభై సంవత్సరాలనుండీ జరిగిన ప్రచారప్రబోధాలవల్ల ఇప్పటికి యూనివర్సిటీలసంఖ్య యిరవైదాకా పెరిగింది.

ఏజాతిగాని, ఏభాషగాని, ఏదేశంగాని, అభివృద్ధిపొందాలంటే విద్యాప్రచారం బాగాసాగాలి. ఇప్పుడు ఆంధ్రులకుప్రత్యేకంగా యూనివర్సిటీయేర్పడింది. అందువల్ల తమమాతృభాషలో సర్వవిజ్ఞానమూ సంపాదించవచ్చు. అనునాతనయుగంలో గొప్పగొప్ప విద్యాంసులందరు మాతృభాషా ప్రబోధనకు ప్రాముఖ్యం యివ్వాలని అందరూ వసల్పుతున్నారు, ఇతరదేశాలల్లో చాలాకాలంనుంచే ఈ ప్రచారం సాగుతున్నది. అలా వగాత్మభాషాబోధన జరిగినప్పుడే విద్యార్థులవ్యాసంగాలకు చెప్పేవిషయం బాగాహత్తుకుపోతుంది. మన శర్మగారు ఈసంస్థానంలో విద్యాధికారులుగావుండి తగినంత విద్యాప్రచారం సాగిస్తున్నారు. వారిని మీఅందరితోబాటు నేనున్నూ హృదయపూర్వకంగా అభివందిస్తున్నాను.

ఈసంస్థానంలోవున్న లోకల్‌ఫండు స్కూళ్ళ అభివృద్ధికూడ గమనింపతగ్గవిషయం. శ్రీ శర్మగారు సంస్థానానికివచ్చినదిమొదలు విద్యాప్రచారం బాగాజరిగింది. ప్రతి స్కూళ్ళలోను యాభైమందిపిల్లలుండేటట్లు మాడటం ప్రజలయొక్కవిధి. అంతకన్న ఎక్కువమంది వుంటే, మాకు తెలియజేస్తే సూపర్‌వైజరుగారైన శ్రీ శర్మగారిద్వారా మరియొక ఉపాధ్యాయున్ని ఏర్పరుస్తాం.

---

## మహబూబునగరం

### శ్రీ. వై. డీ. జోషిగారి యుపన్యాసము

(స్వ. వి.)

౧౫ వ తేదీ.

నిన్నటిరాత్రి ఇచ్చటి ఆర్యసమాజమందిరము లో యథాప్రకారము వ్యాఖ్యానమునకై అంద రుసమావేశమైరి వందకుపైగా జనమువచ్చియుం డెను.

శ్రీ సాంబమూర్తి సిద్ధాంతరత్నగారు, నారాయణశెట్టిగారు వైదికధర్మగీతములుపాడిరి. పిదప ప్రోద్బలమున శ్రీ వై. డి. జోషి, జనరల్ సెక్రెటరీ హిందూప్రజామండలిగారలు ఒకగంటగంభీరోపన్యాసమునొనర్చిరి

"ఇళా సరస్వతీ, మహీ" ఈమూడుదేవతలను ప్రతిమానవుడు పూజించవలయుననిరి. మొదటిది తనమాతృభాష. ప్రతివాడు అభ్యసించవలయుననిరి. ఉదరపోషణార్థమై ఇతరభాషలనభ్యసించినను తనమాతృభాషయందు పండితుడైయుండవలయుననిరి. ఈరీతి గానున్నవారే తమస్వత్వమును, తమజాతీయస్వత్వమును గ్రహించగలరని తెలిపిరి.

రెండవది సభ్యత, ప్రతిమానవుడుప్రొద్దటినుండిరాత్రివరకు ఏమిచేయవలయునో, తాను చేయుకృత్యములు సభ్యతగానున్నవాలేవాగ్రహించవలయునని తెల్పిరి.

సనాతనధర్మప్రకారము ఈశ్వరలింగమును పూజించువారు ఆమూర్తిఎదుటకూర్చొని దానికి పూలతోనలంకరించి తమహృదయములనురాయి చేసుకొనుటకాదు. కానిఈశ్వరునితనజాత్యభివృద్ధికై ఏలాటిత్యాగములుచేసెను వాటినిగ్రహించి అరీతిగావర్తించవలయును.

ధర్మమునుస్థాపించి, ఇతరమతస్థులపాలైపోవుచున్న హిందూజాతియొక్క హీనదశనుఉద్ధరించుటకైజనన మొందిన శ్రీ దయానందసరస్వతీగారుస్థాపితముపుట్టినపుణ్యభూమి

హిందూప్రజామండలినిగూర్చికొంతచర్చించిరి. హరిజనులుపైతమువవారే మనఅన్నతమ్ములమనలోచేర్చుకొనవలయుననిరి. బ్రాహ్మణ వైశ్య శూద్రవివాదములులేకుండా భారతదేశమునివసించుప్రతిహిందువు హిందూప్రజామండలిలోచేరవచ్చుననిరి. ఒకమతమునుగూర్చికాని, ఒకపక్షమునుగూర్చిగాని సంబంధములేదనిరి. దేవతాకార్యములందేగాని, రాజకీయవిషయములందేగానిఏలాటిలోపములొచ్చినను ఈమండలితీర్చగలదనిరి.

### హిందీపాఠశాల

ఆర్యసమాజమందిరములో రాత్రిపాఠశాలస్థాపింపబడినది, నలుబదివరకు విద్యార్థులువచ్చుచున్నారు. శ్రద్ధతో సాంబమూర్తిగారు ఉచితకృషిసల్పుచున్నారు విద్యార్థులకు హిందీ నేర్పుటకుమంచిఅవకాశముచిక్కినది.

### హరిజనుల భజనమండలి

టాంగాలుతోలే వైపుపిల్లలు, కొందరుహరిజనయువకులు శ్రీ సాంబమూర్తిగారి ప్రోద్బలమున ఒకభజనమండలిస్థాపించి ప్రతిశుక్రవారము భజనజరుపుచున్నారనికూడా తెలియుచున్నది పోలీసువారు తదితరులు బెదరించుచున్నారని తెలియుచున్నది, కాన్నివారు పట్టువిడువక ఆరీతిగా భజనని రాటంకంగాజరుపుచున్నారు.

## హిందూమహమ్మదీయసమస్యాపరిష్కారము

### సనాతనధర్మసభ కార్యదర్శిగారి విపరీతాక్షేపణకు సమాధానము

హిందూమహమ్మదీయ సమస్యాపరిష్కారంనకై ఇటీవల సిరిసంప్రదింపులు జరుగుచున్నవని తెలిసి దేశీయులలోచాలామందికి నూతనఆశగలిగెను. ఈప్రయత్నములు సఫలముకావలెనని దేశీయులు ఆశించుచుండిరి. కాని ఈలాంటియత్నములకుకూడ కొన్నిప్రతీకారశక్తులుండుట సహజమే, ఈసందర్భమున హైదరాబాదుహిందూప్రజామండలి కార్యదర్శియగు శ్రీ భాస్కర్ రావు కేస్కర్ గారిపత్రికాప్రకటనయును, సికింద్రాబాదులోనున్న సనాతనధర్మమహాసభాకార్యదర్శియగు శ్రీ నీలకంఠముగారి పత్రికాప్రకటనయును చదివేఅవకాశమునాకుచిక్కెను. సంఘములున్న తమతమసంఘసభ్యులకేతప్ప పరులకెవ్వరికిని హిందూమహమ్మదీయ సమస్యాపరిష్కారమునకై అగత్యములేదని ప్రకటించినప్రకటనలునాకు విచారము, విస్మయముగలిగించెను. కాని ఈఉభయసంఘముల కార్యదర్శులు ప్రకటించినపత్రికాప్రకటనలకు ఆయాసంఘముల ఆమోదమెంతవరకున్నదోలేక ఈప్రకటనలు వారివ్యక్తిగతమైనవో నాకు తెలియదు. బాల్యవివాహనిషేధపు చిత్తుశాసనమును ప్రతిఘటించు ఉద్దేశముతో ఇటీవల కొన్నిమాసములకు పూర్వమే ఈ సనాతనధర్మసభ జన్మమెత్తినది. "ధర్మము" "మతము" యను పేరుప్రచారముచేసి విజ్ఞులపైన సంతకములుతీసికొనుట వేరువిషయము, రాజకీయములను సరిగా అవగాహనముచేసికొని దేశముయొక్క యథార్థపరిస్థితులు అవసరములను తెలిసికొనేవారి పక్షమున ప్రాతినిధ్యమువహించుట వేరువిషయము. ఈసంస్థానిర్మాతలయొక్క సదుద్దేశ్యములగురించి అనుమానింపవీలులేనిచో, హిందూసంఘములో కాలానుగుణముగ కొన్నిఆచారసాంప్రదాయాలకు స్థిరత్వముఏర్పడి మతస్వరూపముగలిగెనో, వాటిని మార్పుచేయుటకై ఈసంస్థ స్థాపింపబడినదని తలచవచ్చును. ఈవిధముపైన భావములుండవచ్చును. కాని ఈలాటి సంస్థకు రాజకీయములతో సంబంధము ఏవిధముగ కలుగునో అగమ్యగోచరముగనున్నది. ఒకవిధమైన మతవిశ్వాసము సనాతనధర్మమని నాకుతోచుచున్నది, ఈలాంటి మతవిశ్వాసములున్న వ్యక్తులు రాజకీయముగా జాతీయ కాంగ్రెసువారలు కావచ్చును. లేదా హిందూమహాసభవారు కావచ్చును. కాని రాజకీయములోకూడ సనాతనధర్మమనేది ఉంటుందని నాకుగోచరముగుటలేదు. ఈసనాతనధర్మసభ కార్యదర్శియగు శ్రీ నీలకంఠముగారు రాజకీయములలో ఎందుకు కలుగజేసికొనవచ్చునో బోధపడదు. ఈసంప్రదింపులకు వ్యతిరేకమైన శక్తులేమైన శ్రీ నీలకంఠంగారి జోక్యము కలుగజేసికొనుటలో అంతర్ధానమైయున్నవాయని తోచుచున్నది. బాల్యవివాహ నిషేధ చిత్తుశాసనసందర్భమున శ్రీనీలకంఠముగారికి సహాయపడిన పత్రికారాజములకు సరిగి ఇప్పుడు శ్రీనీలకంఠముగారు కృతజ్ఞతాసూచకముగా ఈవిధమున అపత్రికాధిపతుల అభీష్టములకు ఈడేర్చుటకు ఈవైఖరి అవలంబించవలసివచ్చెనా?

హిందూప్రజామండలి కార్యదర్శి గారి వైఖరికూడ చాలా విచిత్రముగనున్నది. హిందూప్రజామండలిలో యున్నవారివైఖరి ప్రస్తుతముఉత్పన్నమైన సమస్యసందర్భమున ఇదేవిధముగనున్నదని నేనుఊహించజాలను. ఈసంస్థలోచేరియున్న చాలమందిగౌరవనీయులైన పెద్దలు ఈసమస్యకు వ్యతిరేకులుకారని నాకు తెలియును. వారు సంస్థయొక్క సర్వతోముఖాభివృద్ధిని సదా వాంఛించుచున్నారు.

తెలంగాణాయొక్క పరిస్థితులను ఈప్రాంతీయులవ్యక్తులను భావములను నాకు కొద్దిగా తెలిసికొనే అనుభవముకలిగెను, నాకుకలిగినఅనుభవమువల్ల తెలంగాణావాసులు ఏలాటిమతవిశ్వాసములున్నవారైనను సరేకాని, జాతీయభావములపైన రాజకీయాభివృద్ధిని ఆపేక్షించువారని రూఢిగ చెప్పుచున్నాను. సనాతనాచారమత విశ్వాసములకు జెందినవారు అధికసంఖ్యగనుండవచ్చును. కాని వీరు శ్రీనీలకంఠముగారివంటి సనాతన ధర్మావలంబకులు కారు. శ్రీ కేస్కరుగారివంటి హిందూ మహాసభాభిమానులు కారు. శ్రీకేస్కరుగారికి మహారాష్ట్రములోని కొన్నికొన్ని భాగములలో అనుచరులుండవచ్చును, కాని కేస్కరుగారు "హిందూప్రజామండలి" పేరున తెలంగాణముయొక్క (२८) లక్షల ప్రజా ప్రాతినిధ్యము వహించు ఉద్దేశ్యములను విసర్జించుకొనవలెనని కోరుతాను.

ఇరువైసంవత్సరములనుండి సుహృద్భావముతోను, ఓపికతోను తెలంగాణాను సేవచేయుచున్న ఆంధ్రమహాసభయే తెలంగాణాప్రాంతీయుల అభిప్రాయముల ప్రతిబింబము, ఈఆంధ్రమహాసభయే తెలంగాణాప్రాంతీయులకు ప్రాతినిధ్యమునకు అర్హతగలసంస్థయని అందరికీ తెలిసినవిషయమే, ఆంధ్రమహాసభ ఎంతవరకైతే హిందూమహమ్మదీయ సమస్యయొక్క సంప్రదింపుపై ఏవిధమైన వ్యతిరేకముగు అభిప్రాయమును ప్రకటించదో అంతవరకు ఇతరసంస్థలుకాని, లేక ఇతర సంస్థల కర్తలుగాని, వ్యక్తపరచే అభిప్రాయములకు తెలంగాణాప్రాంతమువరకు ఏలాటివిలువయుండదు, ప్రస్తుతసంప్రతింపులకు భంగముకలుగజేయజాలరు. కాని ఆంధ్రమహాసభాకార్యకారిణీసభానిర్ణయము ప్రకటింపబడువరకు తెలంగాణావాసులెవ్వరును వ్యక్తిగతమైన తమతమఅభిప్రాయములను వ్యక్తపరచకుండుటగాక యనికోరుచున్నాను. ఈ విధముగుఅభిప్రాయములు ప్రకటించుటవలన జరుగుచున్న సంప్రతింపులకు హానికలుగవచ్చును. దేశములో దురదృష్టవశాత్తున కొన్నిగోజాలనుండి ఉత్పన్నమైన విషమపరిస్థితులను, చీలికలను, రూపుమాపుటయు, మంచివాతావరణము కలిగించుట ప్రతిపౌరునియొక్కవిధి, తెలంగాణావాసులు అధికసంఖ్యలోనున్నందున వీరిపైన ఈవిధియొక్క భారము అధికమగుచున్నది.

శ్రీ కాశీనాథరావువైద్యాగారు హిందూమహమ్మదీయ సమస్యపైసంప్రతించుచున్న ఈసందర్భమున దేశములోని అభివృద్ధిదాయకవివిధశక్తులను గమనింపకలరనియు, యోప్రాతిపదికఆశయము లు ఐక్యమునకు, సిద్ధాంతమునకు మనమయింత వరకు ఉద్ఘోషించుచుంటిమో వాటినన్ని శ్రీవైద్యాగారు పూర్తిగాపాటించెదరని విశ్వసించుచున్నాను. ఈముఖ్యతమమైన హిందూమహమ్మదీయసమస్యను సంప్రదించువారెవరైననుసరే,వారు ఆంధ్రమహారాష్ట్ర, కర్ణాటక భేదములు లేకుండ అన్నిపక్షములకార్యకర్తలవిశ్వాసమును బడయుటకు తమపైనున్న బాధ్యతను జ్ఞప్తియందుంచుకొందురని నమ్ముచున్నాను. ఇదేకాకుండా ఈసంప్రదింపులగురించి ప్రాథమికవిషయములు పూర్తియైనపిదప తుదిపరిష్కారమునకుముందు సర్వపక్షకార్యకర్తలసమావేశముజరిపి అందులో ఈసమస్యకు సంబంధించినవివరములన్నిటిని తెలిపి సర్వపక్షామోదమును పొందగలరని నమ్ముచున్నాను

మం. రామచంద్రరావు,
ఆంధ్రమహాసభాధ్యక్షుడు

# గోలకొండ గ్రంథాలయము

## మహాభారత చరిత్రము

కర్త. శ్రీ వెంఢ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు పుటలు ఇంచుమించు ౮౦౦ వెల. ౧-౧౨-౦. ప్రాప్తిస్థానము. గ్రంథ కర్తగారు పిఠాపురము.

శ్రీ వెంఢ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారీగ్రంథాన్ని కొన్ని యేండ్లకుపూర్వము ముద్రించి యుండిరి. మరల రెండవమారు ౧౯౩౯లో ముద్రించినారు. ఈగ్రంథముపై వాదోపవాదములు చాలచెలరేగెను. తుదకు కోర్టుకెక్కవలసివచ్చెను. అవివాదముతో ఇప్పుడుమనకు ప్రసక్తిలేదు,

దీనికంతయు కారణమేమనగా ఈ గ్రంథములో శ్రీశాస్త్రిగారు సాధారణముగాజనులలో వ్యాపించినభావములను తలక్రిందుచేసినారు. మనలో నూటికి౯౯మందికి చిన్నప్పటినుండియుపట్టుపడినభావములలో తటాలున మార్పుచేయువారెవ్వరైనవారినెంతైనను ప్రతిఘటించుట సహజమే. వారిభావములు సరియగునవాకావాఅను విచికిత్స జనులకుండదు. తమదేవతలు రాక్షసులుకాగూడదు తామనుకొన్నరాక్షసులు దేవతలుకాగూడదు. అంతే.

సాధారణముగా మహాభారత పాఠకులకు దుర్యోధనాదులు దుష్టచతుష్టయాలనియు, కౌరవులు దుర్మార్గులనియు, పాండవులు ఉత్తములనియు, కౌరవులచేత పీడితులనియు, శ్రీకృష్ణుడవతారపురుషుడనియు, అందుచేత అతనిని పల్లెత్తుమాటఅనుటకెవ్వరికి అధికారముండగూడదనియు, ద్రౌపది అయోనిజయనియు అపెపూర్వజన్మతపస్సులోని తొందరపాటే అయిదుమందిభర్తలకు హేతువయ్యెననియు, ఇట్టిభావములు బాగుగా నాటుకొనిపోయినవి. వేమనవంటివారు తమపద్యాలలో పాండవులను వెక్కిరించిరి, కాని వేమనవెఱ్ఱివాడు. కావునఅతడేమన్నను చెల్లు. అయితే వెంఢ్యాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు పాండవులేచెడ్డవారనియు, కౌరవులే మేలైనవారనియు, వ్రాసినప్పుడు సనాతనులకు కోపము వచ్చెను.

ఈగ్రంథములో శాస్త్రిగారువ్రాసిన విషయములు అద్భుతమైనపరిశోధనతో కూడినవైయున్నవి భారతదేశపండితులుకాని పాశ్చాత్యపండితులుకాని యిట్టిపరిశోధన యింతవరకు చేసియుండలేదు. ఈగ్రంథమే ఇంగ్లీషులోవ్రాసి అందముగాముద్రించియుండిన మన ఆంధ్రసోదరపండితుని ఖ్యాతి పంచఖండాలలో వ్యాపించుకొనిపోయియుండెడిది. మిడిమిడి పాండిత్యముతో అడ్డాదిడ్డి శ్లోక జ్ఞానముతో తప్పుడుతర్జుమాలసహాయముతో మేమున్నూ పరిశోధకులమే అని కొందరు కుహనాపరిశోధకులు బయలుదేరి ఇంగ్లీషులో గ్రంథాలువ్రాసి అచ్చుకొట్టి అగ్గువకీర్తి గడించుచున్నారు. తీక్ష్ణమైనపాండిత్యము, శాస్త్రపరిశీలనము, భావప్రకటనధైర్యము, సద్విమర్శకశక్తి, అసామాన్యకలిగిన మనశాస్త్రిగారి యీ అపూర్వగ్రంథాన్ని యింతవరకు చూడనివారు అభాగ్యులు.

ఈగ్రంథముపై అభిప్రాయమిచ్చుటలో ఇంకను పెక్కువిషయాలువ్రాయవలెనని కుతూహలముపుట్టును. కానివీలులేదు. ప్రారంభములో మహాభారతకాల చర్చచేయబడినది. శాస్త్రిగారు క్రీస్తుపూర్వము ౧౬౦౦ శతాబ్దమునందు మహాభారతయుద్ధము జరిగియుండెనని వ్రాసినారు. మేము కల్హణ పండితుని అభిప్రాయమువారము. వేదములలో పాండవుల ప్రశంసలేదని శాస్త్రిగారి అభిప్రాయముగా ఉన్నట్లున్నది. స్వర్గీయ మహామని కావ్యకంఠగణపతి శాస్త్రిగారి మతములో ఋగ్వేదములో పాండవుల చర్చయున్నది.

ఈగ్రంథములలో ముఖ్యభాగము ఆకాలమందలి దేశాచారములు. భారతమందు కావలసినన్ని నిదర్శనములుకలవు మొదటిది స్త్రీసమ్యస. స్త్రీ ఆనాడు అనావృత స్వేచ్ఛాచారిణి!

నియోగాది నానావిధసంతానోత్పత్తికి చెల్లుబడియుండెను. ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్కవిధాచారముండెను. శల్యునిదేశములో పిల్లలకు మొదట కల్లుతర్వాత తల్లిపాలు. త్రివిష్టపములో (అనగా ఇప్పటిటిబ్బెటులో) బహుభర్తృత్వముండెను. ఇప్పటికినికలదు ఈ ఆచారమునే అచ్చటివారైన పాండవులు ద్రౌపదియెడ ఆచరించిరి. దక్షిణమున మళయాళములో నిన్నమొన్నటివరకును బహుభర్తృత్వముండెను. ఇప్పటికిని మామూలలలో కనబడుచున్నదందురు అయ్యలకు అనార్యులకు సంబంధాలువిరివిగాజరిగెను. ద్వాదశౌరసపుత్రులకు ఔరసత్వన్యాయము వర్తించెను. ఇట్టివిశేషాలీగ్రంథములో సమృద్ధముగా నిరూపింపబడినవి.

భారతకాలములో ఒక ఆచారము గమనింపదగినది. కొన్నిప్రాంతాలలో చచ్చినవారి శవమును చెట్లపైకట్టుచుండిరి పాండవు లజ్ఞాతవాసకాలమందు తమఆయుధాలను శవాకారముగా కట్టి అచ్చటిగొల్లలతో అది తమతల్లిశవమనిచెప్పిరి. అది దేశాచారవిరుద్ధమైన గొల్లలామాటలను విశ్వసింతురా? ఈయాచారము ఇప్పటికిని పార్సీలలోకలదు అనగా భారతదేశమునుండి పారసీకులు జరథుస్త్ర నాయకత్వములో వేరై ఈరాన్ (ఆర్యన్)దేశమునకు పోకముందు ఈదేశములోను ఈయాచారము కొద్దిగా అచ్చటచ్చటఉండెనేమో. ఇట్టివిషయాలుకూడ భారతకాల నిర్ణయములో తోడ్పడును.

గ్రంథకర్తగారు చేసినశ్రమఅపారము వారి సిద్ధాంతములన్నింటిని మనము ఒప్పుకొనవలసిన అవసరములేదు. వారు భావప్రకోపముకలిగించు అంశములను మనకు చూపించుచున్నారు. కొన్ని ఊహలనుగూడ చేసియున్నారు. ఈ యూహారములు భావిపరిశోధకులకు గొప్పసహాయకారిగానుండునటలో సందేహములేదు శాస్త్రిగారిపరిశ్రమను మేము గాఢముగా అభినందించుచున్నాము.

సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ శిల్లారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** **Hyderabad-Dn.** **Thursday** **23 January 1941** **Number 72**


## విధినిర్వహణయందు చైనాస్త్రీల కఠోరదీక్ష

### దండెత్తివచ్చిన సేనానిని మరలింపజేసినది

చైనాదేశపు చారిత్రిక గాథలయందు ఎక్కడ చూచినను పూర్వమునుండి చైనీయ స్త్రీలయందు విధి నిర్వాహణలో కఠోరదీక్ష సంప్రదాయముగా వచ్చుచున్నట్లు కనిపించును. ఉదాహరణార్థము చైనాలో క్రీస్తుశక ప్రారంభానికి ౯౦౦ ఏండ్ల పూర్వమునుండి ౩౦౦ఏండ్ల పూర్వమువరకు చైనాలో యుద్ధములు ఎక్కువగా జరుగుచుండిన కాలమునకు సంబంధించిన గాథను చెప్పవచ్చును.

'చి'అను రాజ్యమునుండి 'లు'అను రాజ్యముపైకి దండయాత్రకై సేనపంపబడినది. 'లు'రాజ్యపు సీమయందు 'చి' రాజ్యసేనల నాయకునికి కొంతదూరమున ఒక స్త్రీ ఒక బిడ్డను చంక బెట్టుకొని మరొక బిడ్డను నడిపించుకొని వచ్చుచుండుట కనిపించెను.

'చి' రాజ్యసేన ముందుకువడచుచు ఆస్త్రీకి సమీపమునకు వచ్చుచుండగా, ఆస్త్రీ చంకనుండినబిడ్డనుదింపి. నడచుచుండినబిడ్డను చంకబెట్టుకొని ప్రయాణము సాగించెను. క్రిందదింపిన బిడ్డ ఏడుచుచున్న, ఆస్త్రీ తిరిగిచూడలేదు. అప్పుడు 'చి'రాజ్య సేనానాయకుడు ఏడ్చుచున్న బిడ్డను 'ఆ స్త్రీఎవరూ' అని అడిగెను. ఆబిడ్డ "నా తల్లి" యని చెప్పెను. ఆసేనానాయకుడు ఆశ్చర్యముతో వేగముగా ఆస్త్రీవైపుపోయి ఎందుకిట్లుచేసితివనిఅడిగెను. అందుకు ఆస్త్రీ అప్పుడు తనచంకనుండినబిడ్డ తనసోదరునిబిడ్డయనియు, వదలిపెట్టినబిడ్డ తనబిడ్డయనియు. 'చి' రాజ్యసేన వేగముగా త్రోసికొనివచ్చుచుండుటచే ఇద్దరు బిడ్డలను రక్షించుకొనజాలనని తలచి తనబిడ్డను వదలితినని యుచెప్పెను. మరినీకు ఏబిడ్డ ఎక్కువప్రేమాస్పదముఅని ఆ సేనానాయకుడు అడుగగా, ఆ స్త్రీ తనబిడ్డయేయనుచు, కాని తన సోదరునిబిడ్డను రక్షించుట తనవిధియనియు తనబిడ్డను పోగొట్టుకొన్నను తప్పులేదనియు చెప్పెను.

అప్పుడు ఆసేనానాయకుడు తన సేనను 'లు' రాజ్యసీమనుండి మరలించుకొని తనప్రభువునద్దకు పోయి "ప్రభూ, 'లు' రాజ్యము అజేయము, సాధారణస్త్రీకూడ తనవిధిని అన్నిటిలోకి ప్రధమమని భావించును, ఇకఅక్కడి పండితుల. అధికారులసంగతి ఏమనుకొనవచ్చునో ఊహించుడు. కావున్నటి నాసేనను మరలించుకొనివచ్చినాను." అని విన్నవించెను.

ఈ గాథను వ్రాసినవాడు "విధి నిర్వహణదీక్ష యొక్క మహిమనుగమనించుడు. అబలయైనను, దేశముయొక్క గతి ఆమెను నమ్మియుండెను." అని అభిప్రాయము వ్రాసినాడు,

ఇపుడు చైనారాజ్యము ఆ'లు' రాజ్యమువలెనే అజేయముగా నున్నది.

## గ్యాసునూనె ధర హెచ్చుట

బర్మానుండియు, ఇతర దేశాల నుండి గ్యాసునూనె తెప్పించుటకు మోటరుసుములు, భీమారుసుములు హెచ్చినవని వ్యాపారస్థులు మొఱపెట్టుకొనగా, ఇండియా ప్రభుత్వమువారు ౧౯౪౧వ సంవత్సరము జనవరి ౧౫వ తేదనుండి జానుఆఖరువరకు ఈక్రిందిటోకుధరలకుఅమ్ముకొనవచ్చునని అంగీకరించినారు.

ప్రతిగ్యాలనుకు ఇదివరకుండినధరపై ౧౪ రెట్లుహెచ్చించి, తక్కువరకపునూనెను నా గ్యాలనులు రూ ౪-౧౦-౭ లవంతునను, మేలు రకపునూనెను రూ ౫-౭-౭ లకు వంతునను అమ్ముకొనవచ్చుననినారు. పెట్రోలునర గ్యాలనుగకి రూ ౧-౫-౦వంతున ఇపుడున్నట్లేయుండును.

## వీరశైవులకు సూచన

[జనాభా]

వీరశైవ మతీయసోదరుల నేతలు ముందురాగల మర్దుంషుమారీలో తమనుగూర్చి యేవిధముగ వ్రాయవలెనో తెలుపమని జాబులువ్రాసినారు, కర్ణాటకమహారాష్ట్రాంధ్రపత్రికలలో కొంతచర్చయు జరుగుచున్నది. కొందరుమరాఠులతో హిందువులముకామనిచెప్పించుటకై ప్రయత్నములు చేయుచున్నట్లు తెలిసినది. ఇట్లుకూడదని "వీరశైవులు లింగాయతశబ్దము" అనువ్యాసమున విస్తారముగ వివరించివాను. ముందునెలలో జరుగగల జనపరిగణనలో ధర్మము. హిందూధర్మమనియు, మతము. వీరశైవమనియును స్పష్టముగా జెప్పవలెను. మీరుచెప్పినటులే లెక్కలనువచ్చెడువారు వ్రాసికొనవలసియుందురు. వృత్తి (ఉద్యోగము) మీకున్నదిచెప్పవచ్చును. ఈసమస్యనుగంభీరముగా ఆలోచించని వారిమాటలునమ్మి మోసపోవలదు. హిందువులనుండి పాశిపోయినచో గొప్పహానికలుగును,

చిదిరెమఠము వీరభద్రశర్మ

## ఆచార్యవినోబాగారి సత్యాగ్రహము

ఆచార్య వినోబాభావుగారు జనవరి ౧౭వ తేది పులగాఙ్గ్రామంలో యుద్ధప్రతికూలోపన్యాసమును మూడవసారి చేసినారు. కాని వారినింకా అరెస్టు చేయలేదు.

## బ్రిటిషుప్రభుత్వానికి ముసల్మానుల సంతృప్తి అవసరము

బ్రిటిషుసామ్రాజ్యరక్షణ దీక్షసంఘమువారి ప్రచారము

బ్రిటను ప్రధాననగరమగు లండనులో బ్రిటిషుసామ్రాజ్య రక్షణదీక్షసంఘము (ఇంపీరియల్ పాలిసీగ్రూప్) అను ఒక సంఘమువారు ఇటీవల గావించిన ఒకవిజ్ఞప్తిలో ఇట్లున్నది. "ఉత్తర ఆఫ్రికా, అరేబియా, మధ్యఆసియా, ఇండియా లయందంతటను మహమ్మదీయులు బ్రిటిషుప్రభుత్వమునకు ప్రతికూలురనునట్లు మనశత్రువులప్రతినిధులు ప్రయత్నించుచున్నారు. జర్మనులఎత్తు చాలాతెలివితోగూడినది. వారలు తమరస్వామిత్రులచే భారతదేశమందు అతివాదులగుహిందువులను ప్రోత్సహించుటకు తమచేతనైనదెల్లచేయుచుందురు. ఈతీవ్రవాదులకు అనుకూలము అభిప్రాయము బలపడునట్లుచేసి బ్రిటిషుప్రభుత్వవిధానము నిర్ధారణగా మారునట్లుచేయుటకై అమెరికాలో ఉపన్యాసములిచ్చు భారతీయులకు వారలు ధనసహాయముచేయుచుందురు, మనము కాంగ్రెసుకోరికను ఏమాత్రమైనను తీర్చుటకు యత్నించునపుడెవారలు మనకుతూర్పుదిశన మధ్యప్రాంతపుదేశాలలోనుండు ముసల్మానులకు మనకు వ్యతిరేకులగునట్లు పురికొల్పుదురు. అక్కడజర్మనుప్రచారకులు మనముభారతదేశములో ముసల్మానులయెడ నమ్మకద్రోహముచేసియున్నట్లు సూచించుటకు ప్రారంభింతురు. మనము ఏవిధముగ గాని ముసల్మానులను దూరముచేసికొనరాదు, ఈపటుత్వముగల జనులస్నేహము మనకెంతో అవసరమైయున్నది. దురదృష్టవశమున అమెరికాసంయుక్తరాజ్యములోను బ్రిటనులోను భారతదేశమునుగూర్చి తెలియబరచెడివారలు ఎక్కువమంది అతివాదులే, భారతదేశములో ముసల్మానులయోగక్షేమ భారముమనదిగనుక, మనముఏదోయొక్క మంచిప్రచారము చేయవచ్చును"

ఈసంఘమునకు సూత్రధారియైన లార్డుఫిట్జిమోర్ గారు బ్రిటిషుపార్లమెంటు లార్డ్సుసభయొక్క క్రొత్తనాయకునుగా ఇపుడున్న లార్డులయడ్ గారికి మంచిస్నేహితుడు.

## సికింద్రాబాదు నిజాంసర్కారువారికి చెందచేయుట

ఒకసవరణ

సికింద్రాబాదు(దక్కన్) జనవరి ౨౧

బాజీకృష్ణారావు బి, యే. బి. యల్ గారిట్లు సికింద్రాబాదునుండి వ్రాయుచున్నారు.

నిన్నటిగోల్కొండపత్రికలో నేను ౧౮వజనరినాడు సర్ అక్బర్ హైదరీగారికి పంపినతంతి వార్తను, మఱియువుత్తరముల సారాంశమును ప్రకటించియున్నారు. చదువరులకు, నేనుసికింద్రాబాదును మరలనిజాంసర్కారుగారికి చెందజేయుటకు అభినందనీయమని నేనునాభావమును తెలిపినటుల కనపడవచ్చును. ఇదిపొరపాటు అసలుతంతియు, వుత్తరమును యింగ్లీషుభాషలోవుండినవి. తెలుగుతర్జుమాలో సరియయినభావము రాలేదు. నేనుయెప్పటికినీ సికింద్రాబాదు నిజాంసర్కారువారికి జెందజేయుటఅభినందనీయమని చెప్పలేదు. తంతిలోగాని, వుత్తరములోగాని చెప్పియుండలేదు. తంతిలోను, వుత్తరములోను నేను అందరికిని ఘనతవహించిననిజాంగారికిని సర్అక్బర్ హైదరీగారికిని మరిఅందరికీ ఆనగాహిందూప్రజకున్ను తదితరులకున్నూ సంక్రాంతిసందర్భమున పరమేశ్వరుడు శక్తిసామర్థ్యమునిచ్చి అనుకూలభావమును హెచ్చింపజేయుగాక యని కోరినాను- సంపూర్ణముగాతంతియును వుత్తరమును యింగ్లీషులోచదివినయడల యదార్థమును గ్రహించి నేను సికింద్రాబాదుహిందూప్రజాగౌరవమును యేప్రకారము గాస్థాపించినది తెలియవచ్చును- అభినందనముకాదు- ముద్దాటికికాదు.

బాజీకృష్ణారావు బి. ఏ. బి.ఎల్.

## విజ్ఞాననికేతన వార్షికోత్సవము

(ఖమ్మంమెట్టు)

శ్రీ విజ్ఞాననికేతన వార్షికోత్సవము మాఘశు ౨,౩లు (౨౯,౩౦ ఇస్ఫందారు) బుధ,గురువారములందు, నిజామాంధ్ర గ్రంథాలయసంఘాధ్యక్షులు శ్రీఆచార్య ఇల్లెందల సీతారామరావుగారి అధ్యక్షతన జరుగును. శ్రీతూము వరదరాజులుగారు ప్రారంభోత్సవమును జరిపెదరు.

ఇట్లు

కోదాటి-నారాయణరావు






Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A B.L.